

కడప జిల్లా చెన్నూరులోని పెన్నారు వంతెన.



రాజమండ్రికి సమీపంలో సీతానగరంలోని ఎఱ్ఱవరం వంతెన :
దీనిని 2-4-1958 న రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభించారు.



# ఆంధ్రప్రదేశ్


మే, 1958.

సంపుటి 2 | సంచిక 7

వైశాఖము, శాలివాహనశకము - 1880


## విషయసూచిక



— చందా వివరాలు —

సంవత్సరానికి రూ. 1-8-0 లేక 1 రూపాయి 50 నయాపైసలు

విడిప్రతి 2 అణాలు లేక 12 నయాపైసలు


ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి

సిటిజన్‌ప్రెస్‌లో ముద్రింపబడినది.

# ముఖచిత్రం



కృష్ణా జిల్లాలో రోడ్డురవాణా జాతీయకరణ తొలిఘట్టాన్ని 1-4-58న
విజయవాడలో రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభించారు.

# "నా స్మృతి పథంలో ...."

(శ్రీ వి. వి. గిరి, ఉత్తర ప్రదేశ్ గవర్నర్)

ఆంధ్ర కేసరి శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు గార్ని నేను నా బాల్యంనుంచీ యెరుగుదును. మా తండ్రిగారూ, వారూ ఒకే సంవత్సరములో (1869) జన్మించారు ఇరువురూ రాజమండ్రీ కళాశాలలో ఒకే ప్రిన్సిపాలు క్రింద విద్యాభ్యాసం చేశారు. 1891 ప్రాంతంలో కాబోలు యిద్దరూ ఫస్టుగ్రేడు ప్లీడరు పరీక్షనే చదివి, వరుసగా గంజాం, గోదావరి జిల్లా కోర్టులలో ప్రాక్టీసు ఆరంభించారు. ఆతరువాత శ్రీ ప్రకాశం పంతులుగారు ఇంగ్లండు వెళ్ళి బారిస్టరు అయారు. నాన్నగారు, శ్రీ పంతులుగారు సమకాలికులే కాక ఆ జన్మాంత మిత్రులు. ఇద్దరూ దిట్టలైన న్యాయవాదులే. రాజకీయ జీవితంలో కూడా వారుసన్నిహితులే. స్వరాజ్యపార్టీలో పండిట్ మోతీలాల్ నెహ్రూ నాయకత్వాన 1927-29లో యేర్పడిన చరిత్రాత్మకమైన కేంద్ర శాసనసభలో యిద్దరూ వున్నారు. ఆ తరువాత యేర్పడిన మద్రాసు కాంగ్రెస్ లెజిస్ లేటివ్ పార్టీలోకూడా యిద్దరూ సభ్యులే. 1937-39లో శ్రీ పంతులు గారు మద్రాసు శాసనసభకి యెన్నికకాగా నాన్నగారు మద్రాసు లెజిస్ లేటివ్ కౌన్సిలులో సభ్యులయారు. నాన్నగారిపట్ల వలెనే వారిపట్ల యెప్పుడూ నాకు సుహృద్భావం. వారి [illegible], జీవితంలో వారి అనుభవాలు నన్నుత్తేజ పరచేవి. నాపదవ యేటినుంచే మహానాయకులలో ఒకరుగా వారిని గుర్తించాను. ప్రజా జీవితంలో వారి ననుసరించి యెంతో మేలుపొందాను.



స్వర్గీయ శ్రీ ప్రకాశం పంతులుగారు

బారిస్టరుగా ఇంగ్లండు నుంచి తిరిగివచ్చిన పిమ్మట 1906 లో వారు బరంపురంలోని మాయింటికి వచ్చారు. ఇంగ్లండు వెళ్ళినందుకు అగ్రవర్ణాలు వారిని వెలివేశాయి. ఆ ధైర్యశాలికి వేమీ లెక్కలేదు. ఫలితాలతో నిమిత్తం లేకుండా తమను సమర్థించే మిత్రులు తమ కులంలోనే వున్నారని నిరూపించుటకై వారు బరంపురం వచ్చారు. నాన్నగార్ని వారు అట్టి మిత్రులలో ఒకరుగా భావించే వారు. వార్ని మాయింటికి ఆహ్వానించారు. ఆపైన, దైవగృహానికి ప్రక్కనగల భోజనాల సావిడిలో యెంతో గౌరవ మర్యాదలతో వారి సహపంక్తిన భోజనాలు జరిగాయి. దానితో మమ్మల్నికూడా వెలేశారు. కాని మేం లెక్కచేయలేదు.

1916 లో బారిస్టరుగా నేను ఇంగ్లండునుంచి తిరిగి వచ్చాను. నా ఎన్‌రోల్‌మెంట్‌ను గురించి

పంతులుగారే శ్రద్ధ తీసుకున్నారు. వారికింద పని నేర్చుకుంటున్నందుకు నాకెంతో గర్వంగా వుండేది. ముఖ్యమైన కేసులలో వారితో కలిసి న్యాయస్థానానికి వెళ్లేవాణ్ణి

## తీక్ష్ణ స్వభావం

ఆ రోజులలో ఇంగ్లీషు వారు భారతీయుల్ని చాలా చులకనగా చూసేవారు. తాము భారతీయులకంటే అధికులమని. ఏ విషయంలోను వారు తమతో సాటిరాలేరని వారి భ్రమ. అట్టి ఇంగ్లీషు వారికి పంతులుగారంటే మంటలు. పంతులుగారు బారిస్టరు ప్రాక్టీసు ఆరంభించిన కొత్త. రాజమండ్రీ ప్లాటుఫారం మీదికి మెయిలువచ్చి ఆగింది. వారు ఒక ఆంగ్లుడు ప్రయాణిస్తున్న మొదటి తరగతి పెట్టెలో యెక్కబోయారు. అతడు వారిని యెక్కనివ్వక తలుపు దభాలున వేసేశాడు. దానిని సహించక వారు తలుపును మళ్ళీ వెనక్కి తోసేశారు. ఆతోపుతో అతడు వెళ్ళి పాపం యెదటతలుపు మీద పడ్డాడు. పంతులుగారు మాత్రం ముందు యేమి జరుగు తుందనే ఆలోచన లేకుండా నిశ్చింతగా వెళ్ళిసీట్లో కూచున్నారు. అసలుఆంగ్లులు యే విషయాన్నైనా తేలిగ్గా తీసుకుంటారులెండి. పై వ్యక్తి తనతప్పు ఒప్పుకుని పంతులుగారికి క్షమాపణ చెప్పుకున్నాడు.

1921 లో మహాత్మాగాంధీ పిలుపు ననుసరించి మేమంతా ప్రాక్టీసు మానేశాం. 1918 సత్యాగ్రహోద్యమంలోను, 1921 సహాయ నిరాకరణోద్యమంలోను కూడా మేం పాల్గొన్నాం. అప్పుడు శ్రీ ప్రకాశం పంతులుగారు మా యేకైక నాయకులు. చాలా కాలం వారు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు. దేశ స్వాతంత్ర్య సముపార్జనకై రాష్ట్రంలో వారి నాయకత్వం క్రింద, దేశంలో గాంధీజీ నాయకత్వం క్రింద మేమంతా పాటు పడ్డాం.

## ధైర్య హిమాచలుడు

మహా ధైర్యశాలులైన భారతీయులలో శ్రీ ప్రకాశం పంతులుగారొకరు. అమృతసర్ ప్రజావధల అనంతరం, మహాత్మాగాంధీ సహాయ నిరాకరణోద్యమం ఆరంభించిన కొత్తలో మద్రాసులో కల్లోలం బయలు దేరింది. పంతులుగారు 144 వ సెక్షన్ క్రింద ప్రభుత్వ వుత్తర్వులను ధిక్కరించగా సైనికులు వారిపై తుపాకి గురి పెట్టారు. అంతటవారు నిర్భయంగా తుపాకి గుండుకి తమ గుండెను చూపి నిలుచున్నారు. అది చూచి సైనికులు దిగ్భ్రాంతులయిపోయి కిక్కురు మనకుండా వారిని వదిలేశారు.

న్యాయమూర్తులు శ్రీయుతులు ఎయిలింగ్, శేషగిరి అయ్యర్ల యెదుట వారు ఒక కేసువిషయంలో వాదించేటప్పుడు నేను వారి సమక్షంలో వున్నాను. అప్పుడు న్యాయమూర్తులలో ఒకరు తమవాదనను సరిగా వినుటలేదని తోచి, అందుకు తమ ఆక్షేపణను తెలియచేయుటకై వారు ఫైలును అవతలకి విసిరి పారేసి, న్యాయస్థానాన్ని విడిచి చక్కా వెళ్లారు. హైకోర్టు బార్ లో వారికిగల వున్నతస్థానం, హోదాలను గురించి న్యాయమూర్తులికి, న్యాయవాదులికి, ప్రజలకిబాగా తెలుసు. ఎంతబాగా తెలుసునంటే, సీనియర్ జడ్జి తక్షణం వారికి కబురంపి తమవల్ల యేదైనా పొరపాటు జరిగితే క్షమించమనీ, వాదనను కొనసాగించమనీ వారినికోరారు. వారున్యాయస్థానాలకెప్పుడు వెళ్లినా న్యాయమూర్తులంతా వారినెంతో గౌరవించి, వారి వాదనల్ని శ్రద్ధతో వినేవారు. కారణం, వినకుండా శ్రీ పంతులుగారినుంచి తప్పించుకోలేమని వారికి తెలుసు.

మద్రాసులో న్యాయవాద వృత్తిలో వున్న కొన్ని సంవత్సరాలలోను వారు లక్షల కొద్దీ ధనం ఆర్జించారు. సహాయ నిరాకర ణోద్యమం రాగానే మారు ఆలోచనలేకుండా వారు తమ వృత్తికి స్వస్తి చెప్పి, సుప్రసిద్ధమైన కాంగ్రెసు దినపత్రిక స్వరాజ్య ను ప్రారంభించారు. కాంగ్రెసు సిద్ధాంతాలను, మహాత్మా గాంధీ ప్రారంభించిన సహాయ నిరాకర ణోద్యమం సిద్ధాంతాలను విశదీకరించుటలో ఆనాడది ప్రముఖమైన సేవ చేసింది. ఆ పత్రిక నిర్వహణకై వారు తమ సర్వస్వాన్ని కోల్పోయారు. కాని

అందుకు వారు యెన్నడూ విచారించి యెరుగరు.

## అక్షరాలా నిజం

సహాయ నిరాకరణోద్యమంలోను, కేంద్ర శాసన సభలోను వారు వహించిన పాత్ర సుప్రసిద్ధమైనది. దానిని గురించి యిక్కడ చెప్పడం చర్విత చర్వణ మౌతుంది. ఆనాటి సమితి మద్రాసు ప్రావిన్సు రాష్ట్రానికి యెన్నికలు జరిగిన రోజులకి సంబంధించిన విశేషాలను వివరిస్తాను. 1936 లో బలవత్తరమైన జస్టిసు పార్టీకి పోటీగా కాంగ్రెసు తన అభ్యర్థుల్ని నిలిపింది. అప్పుడు నేను కేంద్ర శాసన సభ సభ్యుడను. నాకు రాష్ట్ర రాజకీయాలలో ప్రవేశించాలనే ఆసక్తి వుండేది కాదు. ముఖ్యంగా శ్రీ పంతులుగారూ, సర్దార్ వల్లభాయ్ పటేల్, శ్రీమతి సరోజినీ నాయుడు, శ్రీ బూలభాయ్ దేశాయ్, శ్రీ సత్యమూర్తి వంటి వర్కింగ్ కమిటీలోని యితర నాయకుల పట్టుతో బొబ్బిలిలో బొబ్బిలిమహారాజుకి పోటీగా నేను యెన్నికలకి నిలిచాను. జస్టీసు పార్టీ నాయకుడైన మహారాజా అప్పుడు ముఖ్యమంత్రిగా వుండేవారు. 6666 ఓట్ల మెజారిటీతో మహారాజాను వారి స్వంత జమీందారీలోనే నేను ఓడించగలిగాను. దానితో జస్టీసు పార్టీ పరిపాలన పూర్తిగా విచ్ఛిన్నమయింది. బొబ్బిలి మహారాజాను యితరుల మాటలావుంచి ఆఖరికి గాంధీజీ కూడా ఓడించలేరని అప్పుడు ఇంగ్లండులో వున్న లార్డు వెల్లింగ్టన్ అన్నారు. "మహాత్మా గాంధీ వరకూ యెందుకు కాంగ్రెసు పేరుచెప్పి ఆఖరికి ఒక రాతి బొమ్మని నిలబెట్టినా, అది మహారాజాని ఓడిస్తుంది" అని యెన్నికలముందు హాస్యోక్తిగా నేను అన్నాను. అత్యధిక మెజారిటీతో నేను గెలుపొందడంతో ఆ మాట 'అక్షరాలా నిజమయింది. చరిత్రాత్మకమైన ఆ యెన్నికలో కాంగ్రెసు విజయానికి కారకులు శ్రీ ప్రకాశం పంతులుగారు ప్రభృతులు. ఎంచేతంటే వారు, పండిట్ నెహ్రూ వంటి భారత నాయకులు ఆనియోజక వర్గంలో పర్యటించారు.

ఆ తరువాత, తప్పో ఒప్పో, నాయకుల మధ్య యేర్పడిన విభేదాల కారణంగా పంతులుగార్ని విడిచిపుచ్చి, 1935 ఇండియా ప్రభుత్వ చట్టం క్రింద 1937లో కొత్తగా యేర్పడిన ప్రభుత్వంలో సాధ్యమైతే వారికి మంత్రి పదవి లభించకుండా చేయాలని ప్రయత్నం జరిగింది. రాజాజీ మంత్రి వర్గంలో నాకు మంత్రి పదవి లభించే అవకాశమేర్పడింది. మేమిరువురము కలిసి మా యేకైక లక్ష్యమైన రాష్ట్ర ప్రేరకులమై పాటుపడ్డాం.

ఆంధ్ర రాష్ట్రంకోసం మేం పోరాటం సలిపాం. 1937లో కాంగ్రెసు (రాష్ట్ర) ప్రభుత్వంలో మంత్రులుగా వున్నప్పుడు మేం, ఆ విషయంలో చాలా నిర్మాణాత్మకమైన ప్రతిపాదనచేశాం. ఆ ప్రతిపాదనయిది: మద్రాసు గవర్నరే ఆంధ్ర, తమిళ నాడుల గవర్నరుగా వ్యవహరించవచ్చు. రెండు రాష్ట్రాలకిచెన్నపురే రాజధానిగా వుంటుంది. రెండు రాష్ట్రాలకి కలిపి ఒకేహైకోర్టు, ఒకే రెవిన్యూ బోర్డు వుండాలి ఇందుకు సంబంధించిన వివరాలన్నిటిని యిప్పుడు చెప్పదలుచుకో లేదు కాని ఒక్కమాట మాత్రం చెబుతాను. అప్పుడు మా మాటనే కనక సమితి మద్రాసు రాష్ట్ర నాయకులు అంగీకరించి వుంటే, యిప్పుడు యేర్పడిన భాషారాష్ట్రాలు బహుశా యెన్నడూ యేర్పడి వుండేవి కావు. ఐక్య మద్రాసు రాష్ట్రం యేర్పడి భారత దేశానికి ఆదర్శప్రాయంగా వుండి వుండేది.

ద్వితీయ ప్రపంచ సంగ్రామ సమయంలో బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశానికి స్వాతంత్ర్యాన్నిచ్చుటకు నిరాకరించింది. అంతట కాంగ్రెసు సంస్థ, కాంగ్రెసు ప్రభుత్వాలు కూడా అలజడి ఆరంభించాయి. ఆ సందర్భంలో 1940 నుంచి 1945 వరకు మేమంతా జైళ్ళలో గడప వలసి వచ్చింది. డిటెన్షన్‌లోవున్నా, జైలులో వున్నా కూడా నేను కాంగ్రెసు ఖైదీల శిబిరానికి మేయర్‌గా యెన్నుకోబడుతూ వుండేవాణ్ణి. నేను యెప్పుడూ పంతులుగారి గది పక్కనే వుండేవాణ్ణి. అప్పుడు వారికి తగిన సౌకర్యాలను కలిగిస్తూ, వారేదైనా పని చెబితే చేస్తూ వుండేవాణ్ణి. వారు నన్ను

పితృ వాత్సల్యంతో మన్నిస్తూ, నా సలహాను తీసు కొంటూవుండే వారు.

1946లో మళ్లీ కాంగ్రెసు ప్రభుత్వాలు యేర్ప డినప్పుడు, నేను ప్రధాన మంత్రి అయితే, మద్రాసు రాష్ట్రంలో సుస్థిరమైన ప్రభుత్వం యేర్పడుతుందని అంతా భావించారు. ఈ విషయంలో పట్టుపట్టిన వారందరికీ కృతజ్ఞత తెలుపుతూ, నేను పం తులుగారి అనుయాయినని, వారి అంగీకారం లేనిదే ఆ పదవిని స్వీకరించజాలనని తెలియజేశాను. అందువల్ల నాకు యెన్ని కష్టనిష్ఠురాలు వచ్చినా చివరి వరకూ నేను ఆ మాట మీద నిలబడ్డం, పంతులుగారు సమిష్టి మద్రాసు రాష్ట్ర ప్రధాన మంత్రి పదవిని స్వీకరించడం జరిగింది. ఆ ప్రభుత్వం యెంత కాలం పనిచేసిందనేది వేరే విషయం. వారు నన్ను తమకు కుడిభుజంగా భావించే వారు. వారి సిద్ధాంతాల కనుగుణంగా ప్రభుత్వ వ్యవహారాల నిర్వహణకి వారికి నా శక్తి కొలదీ తోడ్పడే వాణ్ణి.

స్వర్గీయ శ్రీ ప్రకాశం పంతులుగారికి, శ్రీ రాజ గోపాలాచారిగారికి ముఖ్యవిషయాలలో అభిప్రాయ భేదాలు వచ్చినప్పుడు, వాటిని తొలగించి, వారిద్దరికీ మధ్య సామరస్యాన్ని కుదర్చడానికి నేను కృషి చేస్తూ వుండే వాణ్ణి. ఇందుకు నేను చక్కగా తగి వున్నటు వారిరువురూ అంగీకరించే వారని వినయ పూర్వకంగా మనవి చేస్తున్నాను. వారిరవురూ నన్ను పితృవాత్సల్యంతో చూసేవారు. కాబట్టి నేను యిట్టి సందర్భాలలో చాల సులభంగా అనధికార వైఖరిలో వారిని కదిపి, పరిస్థితిని చక్కబరిచేవాణ్ణి.

## భారత కేసరి

శ్రీ పంతులుగారు ఆంధ్రుల త్యాగనిరతికి, దేశ సహిష్ణుతకి ప్రతీకలు. ఈనాటి అభివృద్ధికి ఆంధ్ర దేశం వారికి ఋణపడి వున్నది. ఆంధ్ర రాష్ట్రావతర ణకి వారు చాల కృషి చేశారు. దానికి వారు తొలి ముఖ్య మంత్రి కాగలిగారు.

స్వర్గీయ శ్రీ పొట్టి శ్రీరాములుగారి అనుపమ త్యాగదీక్షవినా ఆంధ్ర రాష్ట్రం యింత సులభంగా యేర్పడి వుండేది కాదని, కులమత వర్గ వివక్షత లేకుండా అంతా ఆయననే ఆంధ్ర రాష్ట్ర వాస్తవ నిర్మాతగా గుర్తించాలని నిస్సందేహంగా చెప్ప వచ్చు.

'ఆంధ్ర కేసరి' అన్వర్థ నామధేయులు వారు కేవలం ఒక్క 'ఆంధ్ర కేసరే' కాదు. 'భారత కేసరి' కూడా. వారు ఒక్క ఆంధ్రకోసం కాక భారత దేశం కోసమైకూడా జీవించారు. దాటికోసమే మరణించారు. వారిఆత్మ శాంతించుగాక.



# రాష్ట్రంలో పశు సంపద అభివృద్ధి

## ద్వితీయ ప్రణాళిక లక్ష్యాలు

ఆంధ్రప్రదేశ్ పశుసంపద మొత్తం సంఖ్య 205 లక్షలు. వీటిలో పశువుల సంఖ్య 170 లక్షలు. ఇంత సంఖ్యాబలం వున్నా అది గ్రామీణ ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి చాలా తక్కువ తోడ్పడుతున్నది. ప్రస్తుతం మన ప్రజల ఆహారంలో పాలు, మాంసం గ్రుడ్లు, తక్కువగా వుంటున్నవి. ఆహారంలో వీటిపాలును హెచ్చించుట అతి ముఖ్యం. కాబట్టి వీటి సరఫరాను అభివృద్ధి పరచుట పశుపోషణ కార్యక్రమాల ఆశయమై వున్నది. రాష్ట్రంలోని వ్యవసాయ పనులకి బలిష్ఠమైన యెడ్లను సమకూర్చుటకూడా యీ కార్యక్రమాలలో ఒకభాగమే. గ్రామీణ ఆర్థిక వ్యవస్థ చక్కబడాలంటే పశువులు అత్యధిక సంఖ్యలో వుండుటేగాక అవి మేలుజాతికి చెందినవై కూడా వుండాలి. వాటినుంచి వున్ని, చర్మాలు మున్నగు వస్తువులుకూడా లభిస్తాయి. ఆర్థిక లాభం దృష్ట్యా పరిశ్రమలలో ముడిపదార్థాలుగా వీటి వినియోగం నానాటికీ హెచ్చుతున్నది. ప్రస్తుతపు పశువుల సంఖ్య పశు గ్రాసం సరఫరాకంటె చాలా అధికంగా వుందనే ఫిర్యాదు ఒకటి వున్నది.

ద్వితీయ ప్రణాళిక కాలంలో, మారుమూల గ్రామాలకికూడా పశు చికిత్సా సౌకర్యాల్ని కల్పించి మేలుజాతి పశువుల అభివృద్ధికై సర్వతోముఖంగా కృషిచేయాలని సంకల్పం. మొత్తంమీద రూ. 335.30 లక్షల వ్యయంపై 84 పథకాలు అమలు పరచబడతాయి. ఈఖర్చులో రూ. 105.525 లక్షలు కేంద్రసహాయంగా లభిస్తాయి.

వివిధ ప్రణాళికా పథకాల అమలుకై చాలినందరు పశువైద్య పట్టభద్రులు లేరు. ఈ కొరత తీర్చుటకై, ద్వితీయ ప్రణాళిక కాలంలో బాపట్ల పశువైద్య కళాశాలలో 488 మంది పశువైద్య విద్యార్థులకి శిక్షణ యివ్వబడుతుంది. పశుగణాభివృద్ధి, పాడిపరిశ్రమలలో అధునాతన పద్ధతులలో శిక్షణకై 'పశుపోషణ' లో నలుగురు, 'పాడిపరిశ్రమ' లో నలుగురు విదేశాలకి పంపబడతారు. 28 పశువైద్య సంస్థలు, 77 చిన్నరకం పశువైద్య డిస్పెన్సరీలు, 21 సంచార బిళ్లెట్లు, 105 పశువుల ప్రథమ చికిత్సా కేంద్రాలు ప్రారంభించబడతాయి. ఇవి మారుమూల గ్రామాలకికూడా పశు చికిత్సా సౌకర్యాలను కల్పించుటకు, పశువుల అంటువ్యాధుల నివారణకు తోడ్పడుతాయి. జిల్లా ముఖ్య పట్నాల ఆస్పత్రులలోను, 'లైవ్‌స్టాక్ ఫారమ్' లలోను క్లినికల్ లేబొరేటరీలు యేర్పరచబడతాయి. వీటివల్ల అక్కడికక్కడ రోగలక్షణాలను పరిశీలించి, సకాలంలో చికిత్స చేయుటకు వీలు కలుగుతుంది. కృష్ణానదికి దక్షిణానగల జిల్లాల్లో పని పూర్తయిన 'పిమ్మట 'రిండర్‌పెస్టు' నిర్మూలన వుద్యమం దానికి వుత్తరానగల జిల్లాల్లో ప్రవేశ పెట్టబడుతుంది, ముసలి, గొడ్డుమోతు మున్నగు పశువుల్ని విడిగా వుంచుటకై ఒక గోసదనం యేర్పాటు చేయబడుతుంది.

### తేనెటీగల పరిశ్రమ

పశుగణాభివృద్ధి కార్యక్రమం ముఖ్యంగా కీలక గ్రామ పథకాలద్వారా అమలు పరచబడుతుంది. కీలక గ్రామపథకం ప్రకారం నిర్ణీతమైన కొన్ని ప్రాంతాలలో కేంద్రీకృతమైన కృషి జరుగుతుంది. దానిక్రింద నాసిరకం యెడ్లకి విత్తుకొట్టబడుతుంది. కృత్రిమ పిండోత్పత్తి ద్వారా పశువుల సంతానా

భివృద్ధి కంట్రోలు చేయబడుతుంది. లేగదూడలు సబ్సిడై జుడు ప్రాతిపదికపై పెంచబడుతాయి. ఉత్తమరకం పశువుల సప్లయిద్వారా ప్రస్తుతం నాసిగావున్న రకాలు మేలుజాతిగా పెంపొందించబడతాయి. మనరాష్ట్రంలో పందుల పెంపకం అశ్రద్ధ చేయబడుతున్నది. కాబట్టి దాన్ని ప్రోత్సహించుటకై ఆంధ్రప్రాంతంలో ఒకపందుల పెంపక కేంద్రాన్ని ప్రారంభించాలని సంకల్పం. పంది పారిశ్రామికులకి ఆడ, మగ పందులు సరఫరా చేయబడతవికూడా. ఒక మేకల పెంపక కేంద్రం కూడా ప్రారంభించ బడుతుంది. గ్రామీణులకి ఆడ, మగ మేకలు సబ్సిడై జుడు ధరలకి సరఫరా చేయబడతాయి. తేనెటీగల పెంపకం కుటీర పరిశ్రమగా అభివృద్ధి చెందుటకు చాలా అవకాశంవుంది. కాబట్టి రాష్ట్రంలోని అన్ని పశుపోషణ, కోళ్ళ పెంపక కేంద్రాలలో తేనెటీగల పెంపక కేంద్రాలు నెలకొల్ప బడతాయి. ప్రస్తుతం మూడు గొఱ్ఱెల పెంపక ప్రదర్శన యూనిట్లు వున్ని, మాంసాలకు గొఱ్ఱెల్ని శాస్త్రీయ పద్ధతిలో పెంచి పోషించే విషయమై గ్రామాలలో మామూలు ప్రచారం కొనసాగిస్తున్నవి. గ్రామీణులకి మేలురకం పొట్టేళ్ళ సరఫరాకై యింతవరకూ యేమీ కృషి జరుగలేదు. తగిన సౌకర్యాలున్నందున అనంతపురం జిల్లాలో ఒక గొఱ్ఱెల పెంపక కేంద్రం ప్రారంభింప బడుతుంది. ఇక్కడ బాగా వున్నిని, మాంసాన్ని యిచ్చే గొర్రెల అభివృద్ధికి, విదేశాలకి వున్ని యెగుమతిని ప్రోత్సహించుటకు కృషి జరుగుతుంది. గ్రామీణులికి పొట్టేళ్ళను, గొఱ్ఱెల్ని సబ్సిడై జుడు ధరలకి సరఫరా చేయాలని కూడా సంకల్పించ బడింది

## కోళ్ల పరిశ్రమ

ఉప పరిశ్రమగా కోళ్ళ పెంపకం విలువ యేనాడో గుర్తించ బడింది. కాని అది యెక్కువగా అభివృద్ధి చెందలేదు. మనదేశంలో కోడి పెట్టలు సాలీనా సగటున 50 గుడ్లను మాత్రమే పెడతాయి. అనేక యితర దేశాలలో యీసంఖ్య 120. తరుచు ప్రబలే వ్యాధులవల్ల కోళ్లు నష్టపోవుట వల్ల యీ పరిశ్రమ అభివృద్ధి చెందుటలేదు. జంతువులు, యితర పశులుకూడా గ్రామాలలోని కోళ్ళను యెక్కువగా తినేస్తూ వుంటాయి. రాష్ట్రంలో కోళ్ళను రాణీఖేట్ వ్యాధినుంచి రక్షించుటకు తగిన మందును తయారుచేసే లేబొరేటరీ ఒకటి తొలి ప్రణాళిక కాలంలో గుంటూరులో ప్రారంభింప బడింది. ద్వితీయ ప్రణాళిక కాలంలో దీనికి మరికొంత సాధన సంపత్తి సమకూర్చ బడుతుంది. కోళ్ళపరిశ్రమలో పరిశోధనకై ఒక కేంద్ర కోళ్ళ పరిశ్రమ పరిశోధన కేంద్రంకూడా నెలకొల్ప బడుతుంది. కోళ్ళ పరిశ్రమాభివృద్ధికి కేంద్రప్రభుత్వంకూడా ఒకపైలెట్ స్కీమ్‌ను తలపెట్టింది. ఈ పథకంక్రింద కేంద్రం సరఫరా చేసిన కోళ్ళు రాష్ట్ర కోళ్ళపరిశ్రమ కేంద్రాలలో పెరిగి వృద్ధై, సమాజాభివృద్ధి జాతీయ వికాస సేవాకేంద్రాలలో పంపిణీ చేయబడుతాయి. 1955-56 లో పలమనేరులో ఒక కోళ్లపరిశ్రమ యూనిట్టు ప్రారంభమైంది. ద్వితీయ ప్రణాళిక కాలంలో కొన్ని పైలెట్ ప్రాజెక్టులు పారంభింపబడతాయి. సమాజాభివృద్ధి, జాతీయ వికాస సేవా కేంద్రాలలో కోళ్ళపరిశ్రమ యూనిట్ల ప్రారంభం కారణంగా విదేశపు గుడ్లు, కోళ్ళ అవసరం హెచ్చుతున్నందున రాష్ట్రంలో మరొక కోళ్ళపరిశ్రమ కేంద్రాన్ని ప్రారంభించాలని సంకల్పం.

స్థిరనివాసంలేని పశు పారిశ్రామికులకి ఆవాసం కల్పించుటకై ద్వితీయ ప్రణాళిక కాలంలో ఒక పశుపెంపక (బ్రీడింగ్) సంఘంకూడా యేర్పాటు చేయబడుతుంది. పశుపెంపకం, పాడి పరిశ్రమ, పశువైద్య శాస్త్రాల అభివృద్ధుల ప్రాముఖ్యాన్ని ప్రజలకు విశదపరచుటకై ఆంధ్రప్రాంతంలో 300 పశుప్రదర్శనములు యేర్పాటు చేయబడతాయి.

తెలంగాణా జిల్లాల్లో 13 స్టేషనరీ వెటర్నరీ డిస్పెన్సరీలు, 51 గ్రామీణ వెటనర్రీ డిస్పెన్సరీల ప్రారంభానికి, మందులు, పరికరాల నిమిత్తం అదనపు గ్రాంట్లకి వసతి వున్నది. అంటువ్యాధుల నివారణకై సకాలంలో సమర్థంగా పని జరుపుటకై 4 జీపుకార్లు జిల్లా పశువైద్యాధికార్లకు అందు

బాటులో వుంటాయి. కీలక గ్రామ కేంద్రాల ప్రారంభం, ప్రస్తుతపు పశు పెంపక కేంద్రాల పునర్వ్యవస్థీకరణ, గోసదనం యేర్పాటు, స్థిర నివాసం లేని పశు పారిశ్రామికులను స్థిర పరచుట హైదాబాద్‌లో లైవ్ సాక్ పరిశోధన కేంద్రం స్థాపనల్ని కూడా ప్రణాళిక వుద్దేశిస్తున్నది. తెలంగాణాలో గోశాలలు అభివృద్ధికి కూడా డబ్బు కేటాయించబడింది. గోశాలలు, కోళ్ళ పరిశ్రమల అభివృద్ధికి కూడా ఏర్పాట్లు చేయబడుతుంది. ఇందు నిమిత్తం నల్గొండలో ఒక గోశాల పెంపక కేంద్రం, వున్ని సాంకేతిక లేబొరేటరీ స్థాపించబడతాయి. హైద్రాబాదులో గోశాలలు, వున్ని అభివృద్ధి కేంద్రాలు, కేంద్ర కోళ్ళ పరిశ్రమ కేంద్రం స్థాపించబడతాయి. కోళ్ళ పరిశ్రమ విస్తరణ కేంద్రాలు స్థాపించబడతాయి. కోళ్ళ పరిశ్రమ అభివృద్ధి అధికారి నియమించబడతారు. వివిధ ప్రణాళికల అమలుకి అవసరమైన సిబ్బంది శిక్షణకై హైదాబాదులో ఆరంభింపబడిన 2 సంవత్సరాల ఎమర్జెన్సీ డిప్లొమా కోర్సులో రెండవ జట్టులో 100 మంది విద్యార్థులు చేర్చుకోబడతారు. స్టాక్ మెన్ శిక్షణ, పౌల్టరీ శిక్షణల వంటి స్వల్పకాలిక కోర్సులు ప్రవేశ పెట్టబడతాయి. కరీంనగరంలోని పశు పెంపక కేంద్రంలో డిస్పెన్సరీలకి కొత్త భవనాలు ఏర్పాటు చేయబడతాయి. అక్కడ శిక్షణ పొందే వారికి వసతి గృహం నిర్మించబడుతుంది. ప్రస్తుతపు సీరం సంస్థ పునర్వ్యవస్థీకరింపబడుతుంది. అప్పుడు పశు వ్యాధుల నివారణకై అదనపు మందుల తయారీకి అవకాశ మేర్పడుతుంది. పశు పెంపకం మున్నగు విషయాలలో తాజా సాంకేతిక విజ్ఞానాన్ని రైతులకి తెలియ చెప్పటకై స్పష్టమైన పద్ధతిలో ప్రచారం జరిపించబడుతుంది. ద్వితీయ ప్రణాళిక కాలంలో రిండర్ పెస్టు వ్యాధి పూర్తిగా నిర్మూలించబడుతుంది.

## పాడి పరిశ్రమ

భారతదేశంలో అధిక సంఖ్యాకులు శాకాహారులయిన కారణంచే పాలు చాలా ముఖ్యమైన ఆహారం. మనకి పాడిపశువులు కూడా అత్యధికంగానే వున్నాయి. కాని పాడి పరిశ్రమ మాత్రం వెనుక బడివుంది. ఇదిలావుండగా పట్నాల పాల సరఫరా మరీ అసంతృప్తికరంగా వుంది. పట్నవాసులికి చాలినన్ని స్వచ్ఛమైన పాలు సరఫరా కావు. దీనికి కారణాలు యివి: చుట్టుపట్ల గ్రామాలలో పాల వుత్పత్తికి వ్యవస్థీకృతమైన యేర్పాట్లులేవు. పాల రవాణాకి చిక్కులున్నాయి. పట్నాలలో పాలు అపరిశుభ్రమైన పరిస్థితులలో హెచ్చు ఖర్చుతో వుత్పత్తి అవుతాయి. వాటి పంపిణీ మధ్యదళారుల ద్వారా జరుగుతుంది. ఇటీవల సంవత్సరాలలో పట్నాలకి పాల సరఫరా అనేక కారణాలచేత అత్యావసర సమస్యగా పరిణమించింది. అక్కడ అపరిశుభ్రమైన పరిస్థితులలో కుక్కగొడుగుల్లా లేచిన పాడి పరిశ్రమ కేంద్రాలు ప్రజారోగ్యానికి భంగకరాలు. అక్కడ చాలా మటుకు కల్తీపాలు అమ్మబడుతాయి. కాబట్టి తగినన్ని స్వచ్ఛమైన పాలు, వుత్పత్తి వినియోగదారులికి కష్టనష్టాలు లేని ప్రాతిపదికపై వాటికి సరఫరా అయే యేర్పాట్లు చేయబడాలి.

ద్వితీయ ప్రణాళిక కాలంలో రాష్ట్రంలో రూ. 82.65 లక్షల వ్యయంపై 8 పథకాల్ని అమలు జరపాలని సంకల్పం. ఇందులో రూ. 25.99 లక్షలు అప్పుల రూపంలోను, రూ. 52.19 లక్షలు గ్రాంట్ల రూపంలోనూ కేంద్ర ప్రభుత్వం నుంచి లభించగలవని భావించ బడుతున్నది.

పూర్వాంధ్ర రాష్ట్ర జిల్లాల్లోని పట్నాలకి పాల సరఫరాను హెచ్చించుటకై ప్రస్తుతపు పాల సరఫరా సహకార సంస్థలు పటిష్ఠం చేయబడతాయి. కొత్తవి ప్రారంభింపబడతాయి. పాడి పశువుల కొనుగోలుకై సంఘ సభ్యులికి స్వల్పకాలిక ఋణాలు యివ్వబడతాయి. పాల వాడకం యెక్కువగా వున్న అయిదు నిర్ణీతమైన మునిసిపలు పట్నాలలో పాల తీవ్ర సరఫరా పథకం ఒకటి ప్రవేశపెట్టబడుతుంది. దీని ప్రకారం ప్రతి పట్టణంలోను ఒక మధ్య రకం పాడి పరిశ్రమ ప్లాంటు నెలకొల్పబడుతుంది. దానికి స్వంతంగా స్థలం, భవనాలు, కోల్డు స్టోరేజి ప్లాంటు మున్నగునవి వుంటాయి.

రవాణా, పంపిణీలకు వసతి వుంటుంది. పాలు స్వచ్ఛమైన వవునో కాదో పరీక్షించుటకు లేబొరేటరీ వుంటుంది. ప్రణాళిక కాలం ఆఖరి నాటికి సహకార సంస్థల ద్వారా జరిగే పాలవుత్పత్తి రోజుకి 25,000 మె. మె పెంచబడుతుంది. దేశమంతటా పాల పొడి ఫ్యాక్టరీలను నెల కొల్పాలని భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం పాడిపరిశ్రమ కమిటీ సిఫారసు చేసింది. రాష్ట్రంలో కొన్ని చోట్ల వాడకానికి మించిన పాలు లభిస్తాయి. కాబట్టి ఆంధ్ర ప్రాంతంలో 2 ఫ్యాక్టరీల్ని నెలకొల్పాలని సంకల్పం. ఇప్పుడు పాలపొడి చాలా యెక్కువగా విదేశాల నుంచి దిగుమతి చేసుకొన బడుతున్నది. అది దేశంలోనే తయారైతే మిగులు పాలు లాభకరంగా వినియోగ పడతాయి. సాధ్యమైనంత త్వరలో పాలపొడి దిగుమతుల్ని ఆపివేసు కోవచ్చు కూడా.

ద్వితీయ ప్రణాళిక కాలంలో విశాఖపట్నంలోని పాడిపరిశ్రమ-ఆబోతు సరఫరా కేంద్రం యధాప్రకారం ఆపట్నంప్రజలకి పాలను సరఫరా చేస్తుంది. ఆపైన పచ్చికబయళ్లతో కూడిన మరి 2 పాడిపరిశ్రమ కేంద్రాలు ప్రారంభిప బడతాయి. ఇక్కడ స్వచ్ఛమైన పాలు వుత్పత్తి చేయబడతాయి. అంతే కాక రైతులికి వుత్తమమైన కోడెదూడలు సరఫరా చేయబడతాయి. ఖచ్చితంగా స్వచ్ఛమైన పాలు సరఫరా అగుటకై ప్రతిరాష్ట్రంలోను కమిషనరుతో కూడిన ఒక పాలసంఘం యేర్పాటు కావాలనికూడా భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం పాడిపరిశ్రమ కమిటీ సూచించింది. పాలకమిషనరు సహకార పాలసరఫరా యూనియన్లు, ప్రైవేటు పాడిపారిశ్రామికులు, ప్రభుత్వ పాడిపరిశ్రమ కేంద్రాలుచేసే పనిని సమన్వయం చేయవలసి ఉంటుంది. కాబట్టి ద్వితీయ ప్రణాళిక కాలంలో ఒక పాల సంఘం ఏర్పాటు చేయబడుతుంది.

సమష్టి పాడిపరిశ్రమ.

సరూర్ నగర్ లో ప్రయోగాత్మకమైన సమిష్టి పాడిపరిశ్రమ కేంద్రం ఒకటి నెలకొల్ప బడాలని సంకల్పం. ఇది పశుపోషణ, మత్స్యసంపద శాఖ అధ్వర్యాన పని చేస్తుంది. ఈ పథకం క్రింద మంచి ఆరోగ్యం కలిగి బాగా పాలుయిచ్చే బర్రెలు యీ కేంద్రంలో చేర్చుకొన బడతాయి. వాటి సంరక్షణ భారాన్ని ఆ కేంద్రం సిబ్బంది వహిస్తుంది. యజమానులకి రోజూ కావలసిన పాలు వారివారి యిళ్లకి సరఫరా చేయబడతాయి. పాల అమ్మకంవల్ల వచ్చిన డబ్బు మేతఖర్చు మినహా మిగిలినది యజమానులకి యిచ్చివేయ బడుతుంది. యజమానుల స్వంతఖర్చు పై ఒట్టిపోయిన పశువులు కూడా యీ కేంద్రంలో మేపబడతాయి. మొట్టమొదట యిక్కడ 100 బర్రెలు మాత్రమే చేర్చుకో బడతాయి.



ఖాటులో వుంటాయి. కీలక గ్రామకేంద్రాల ప్రారంభం, ప్రస్తుతపు పశుపెంపక కేంద్రాల పునర్వ్యవస్థీకరణ, గోసదనం యేర్పాటు, స్థిర నివావాసం లేని పశు పారిశ్రామికులను స్థిర పరచుట హైదరాబాద్‌లో లైవ్‌స్టాక్ పరిశోధన కేంద్రం స్థాపనల్ని కూడా ప్రణాళిక వుద్దేశిస్తున్నది. తెలంగాణాలో గోశాలలు అభివృద్ధికి కూడా డబ్బు కేటాయించబడింది. గోష్ఠాలు, గోష్ఠ సంగ్రహణాల అభివృద్ధికి [illegible] చెందుతుంటే, ఇంక్యు[illegible] గోష్ఠాల [illegible], వున్ని సాంకేతిక లేబొరేటరీ స్థాపించబడతాయి. హైదరాబాదులో గోష్ఠాలు, వున్ని అభివృద్ధి కేంద్రాలు, కేంద్ర కోళ్ల పరిశ్రమ కేంద్రం స్థాపించబడతాయి. కోళ్ల పరిశ్రమ విస్తరణ కేంద్రాలు స్థాపించబడతాయి. కోళ్ల పరిశ్రమ అభివృద్ధి అధికారి నియమించబడతారు. వివిధ ప్రణాళికల అమలుకి అవసరమైన సిబ్బంది శిక్షణకై హైదరాబాదులో ఆరంభింపబడిన 2 సంవత్సరాల ఎమర్జెన్సీ డిప్లొమా కోర్సులో రెండవ జట్టులో 100 మంది విద్యార్థులు చేర్చుకోబడతారు. స్టాక్‌మెన్ శిక్షణ, పౌల్టరీ శిక్షణల వంటి స్వల్పకాలిక కోర్సులు ప్రవేశపెట్టబడతాయి. కరీంనగరంలోని పశుపెంపక కేంద్రంలో డిస్పెన్సరీలకి కొత్త భవనాలు ఏర్పాటు చేయబడతాయి. అక్కడ శిక్షణ పొందే వారికి వసతి గృహం నిర్మించబడుతుంది. ప్రస్తుతపు సీరం సంస్థ పునర్వ్యవస్థీకరింపబడుతుంది. అప్పుడు పశువ్యాధుల నివారణకై అదనపు మందుల తయారీకి అవకాశ మేర్పడుతుంది. పశుపెంపకం మున్నగు విషయాలలో తాజా సాంకేతిక విజ్ఞానాన్ని రైతులకి తెలియ చెప్పటకై సోద్దేశమైన పద్ధతిలో ప్రచారం జరిపించబడుతుంది ద్వితీయ ప్రణాళిక కాలంలో రిండర్‌పెస్టు వ్యాధి పూర్తిగా నిర్మూలించబడుతుంది.

## పాడి పరిశ్రమ

భారతదేశంలో అధిక సంఖ్యాకులు శాకాహారులయిన కారణంచే పాలు చాలా ముఖ్యమైన ఆహారం. మనకి పాడిపశువులు కూడా అత్యధికంగానే వున్నాయి. కాని పాడి పరిశ్రమ మాత్రం వెనుక బడివుంది. ఇదిలావుండగా పట్నాల పాల సరఫరా మరీ అసంతృప్తికరంగా వుంది. పట్నవాసులికి చాలినన్ని స్వచ్ఛమైన పాలు సరఫరా కావు. దీనికి కారణాలు యివి: చుట్టుపట్ల గ్రామాలలో పాల వుత్పత్తికి వ్యవస్థీకృతమైన యేర్పాట్లులేవు. పాల రవాణాకి చిక్కులున్నాయి. పట్నాలలో పాలు అపరిశుభ్రమైన పరిస్థితులలో [illegible] ఉత్పత్తి [illegible] వాటి పంపిణీ మధ్యదళారుల ద్వారా జరుగుతుంది. ఇటీవల సంవత్సరాలలో పట్నాలకి పాల సరఫరా అనేక కారణాలచేత అత్యావసర సమస్యగా పరిణమించింది. అక్కడ అపరిశుభ్రమైన పరిస్థితులలో కుక్కగొడుగుల్లా లేచిన పాడి పరిశ్రమ కేంద్రాలు ప్రజారోగ్యానికి భంగకరాలు. అక్కడ చాలా మటుకు కల్తీపాలు అమ్మబడుతాయి. కాబట్టి తగినన్ని స్వచ్ఛమైన పాలు, వుత్పత్తి వినియోగదారులికి కష్టనష్టాలు లేని ప్రాతిపదికపై వాటికి సరఫరా అయే యేర్పాట్లు చేయబడాలి.

ద్వితీయ ప్రణాళిక కాలంలో రాష్ట్రంలో రూ. 82.65 లక్షల వ్యయంపై 8 పథకాల్ని అమలు జరపాలని సంకల్పం. ఇందులో రూ. 25.99 లక్షలు అప్పుల రూపంలోను, రూ. 52.19 లక్షలు గ్రాంట్ల రూపంలోనూ కేంద్ర ప్రభుత్వం నుంచి లభించగలవని భావించ బడుతున్నది.

పూర్వాంధ్ర రాష్ట్ర జిల్లాల్లోని పట్నాలకి పాల సరఫరాను హెచ్చించుటకై ప్రస్తుతపు పాల సరఫరా సహకార సంస్థలు పటిష్ఠం చేయబడతాయి. కొత్తవి ప్రారంభింపబడతాయి. పాడి పశువుల కొనుగోలుకై సంఘ సభ్యులికి స్వల్పకాలిక ఋణాలు యివ్వబడతాయి. పాల వాడకం యెక్కువగా వున్న అయిదు నిర్ణీతమైన మునిసిపలు పట్నాలలో పాల తీవ్ర సరఫరా పథకం ఒకటి ప్రవేశపెట్టబడుతుంది. దీని ప్రకారం ప్రతి పట్టణంలోను ఒక మధ్య రకం పాడి పరిశ్రమ ప్లాంటు నెలకొల్పబడుతుంది. దానికి స్వంతంగా స్థలం, భవనాలు, కోల్డు స్టోరేజి ప్లాంటు మున్నగునవి వుంటాయి.

రవాణా, పంపిణీలకు వసతి వుంటుంది. పాలు స్వచ్ఛమైన వవునో కాదో పరీక్షించుటకు లేబొరేటరీ వుంటుంది. ప్రణాళిక కాలం ఆఖరి నాటికి సహకార సంస్థల ద్వారా జరిగే పాలవుత్పత్తి రోజుకి 25,000 మె. మె హెచ్చించబడుతుంది. దేశమంతటా పాల పొడి ఫ్యాక్టరీలను నెల కొల్పాలని భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం పాడిపరిశ్రమ కమిటీ సిఫార్సు చేసింది. రాష్ట్రంలో కొన్నిచోట్ల వాడ కానికి మించిన పాలు లభిస్తాయి. కాబట్టి ఆంధ్ర ప్రాంతంలో 2 ఫ్యాక్టరీల్ని నెలకొల్పాలని సంకల్పం. ఇప్పుడు పాలపొడి చాలా యెక్కువగా విదేశాల నుంచి దిగుమతి చేసుకొన బడుతున్నది. అది దేశంలోనే తయారైతే మిగులు పాలు లాభకరంగా వినియోగ పడతాయి. సాధ్యమైనంత త్వరలో పాలపొడి దిగుమతుల్ని ఆపివేసు కోవచ్చు కూడా.

ద్వితీయ ప్రణాళిక కాలంలో విశాఖపట్నంలోని పాడిపరిశ్రమ-ఆబోతు సరఫరా కేంద్రం యధాప్రకారం ఆపట్నంప్రజలకి పాలను సరఫరా చేస్తుంది. ఆపైన పచ్చికబయళ్లతో కూడిన మరి 2 పాడిపరిశ్రమ కేంద్రాలు ప్రారంభిప బడతాయి. ఇక్కడ స్వచ్ఛమైన పాలు వుత్పత్తి చేయబడతాయి. అంతే కాక రైతులికి వుత్తమమైన కోడెదూడలు సరఫరా చేయబడతాయి. ఖచ్చితంగా స్వచ్ఛమైన పాలు సరఫరా అగుటకై ప్రతిరాష్ట్రంలోను కమిషనరుతో కూడిన ఒక పాలసంఘం యేర్పాటు కావాలనికూడా భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం పాడిపరిశ్రమ కమిటీ సూచించింది. పాలకమిషనరు సహకార పాలసరఫరా యూనియన్లు, ప్రైవేటు పాడి పారిశ్రామికులు, ప్రభుత్వ పాడిపరిశ్రమ కేంద్రాలుచేసే పనిని సమన్వయం చేయవలసి ఉంటుంది. కాబట్టి ద్వితీయ ప్రణాళిక కాలంలో ఒక పాల సంఘం యేర్పాటు చేయబడుతుంది.

## సమష్టి పాడిపరిశ్రమ.

సరూర్ నగర్ లో ప్రయోగాత్మకమైన సమిష్టి పాడిపరిశ్రమ కేంద్రం ఒకటి నెలకొల్ప బడాలని సంకల్పం. ఇది పశుపోషణ, మత్స్యసంపద శాఖ అధ్వర్యాన పని చేస్తుంది. ఈ పథకం క్రింద మంచి ఆరోగ్యం కలిగి బాగా పాలుయిచ్చే బఱ్ఱెలు యీ కేంద్రంలో చేర్చుకొన బడతాయి. వాటి సంరక్షణ భారాన్ని ఆ కేంద్రం సిబ్బంది వహిస్తుంది. యజమానులకి రోజూ కావలసిన పాలు వారివారి యిళ్లకి సరఫరా చేయబడతాయి. పాల అమ్మకంవల్ల వచ్చిన డబ్బు మేతఖర్చు మినహా మిగిలినది యజమానులకి యిచ్చివేయ బడుతుంది. యజమానుల స్వంతఖర్చు పై ఒట్టిపోయిన పశువులు కూడా యీ కేంద్రంలో మేపబడతాయి. మొట్టమొదట యిక్కడ 100 బఱ్ఱెలు మాత్రమే చేర్చుకో బడతాయి.



# విజయవాడ మండలంలో సహకారోద్యమ వ్యాప్తి

విజయవాడ, గన్నవరం, నూజివీడు, తిరువూరు, నందిగామ తాలూకాలలోని సహకార సంఘాలు విజయవాడలోని సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు అధికారం క్రింద పనిచేస్తాయి. గ్రామ పరపతి సంఘాల్ని పటిష్ఠంచేసి, విస్తృతపరచి తద్వారా గ్రామాలలోని ప్రతికుటుంబానికి సహకార సంఘాలలో ప్రాతినిధ్యం కల్పించాలనిది. అఖిల భారత గ్రామ పరపతి సర్వే తలపెట్టింది. 15 సంవత్సరాలలో గ్రామ పరపతి వ్యవహారాలలో సగాన్ని సహకార సంస్థల ద్వారా జరిపించాలని సంకల్పం. ఈ సందర్భంలో సాధించబడిన లక్ష్యాలు యివి:- 1. నూటికి 93 గ్రామాలకి సహకార వ్యవస్థ తోడ్పడుతున్నది. ఈ విషయంలో నిర్ణయించిన లక్ష్యం సిద్ధించింది. 2. నూటికి 38.5 గ్రామీణ కుటుంబాలకి సహకార సంఘాలలో ప్రాతినిధ్యమున్నది. ఈ లక్ష్యం సంపూర్ణ సిద్ధికై చర్యగైకొన బడుతున్నది.

గ్రామ పరపతి సంఘాల్ని పటిష్ఠం చేయుటకై పెద్ద రకం సంఘాల్ని, గ్రామీణ బ్యాంకిల్ని యేర్పరచాలని అఖిల భారత గ్రామ పరపతి సర్వే సిఫార్సు చేసింది. ఆ ప్రకారం 1. మదునూరు, 2. రామవరప్పాడు, 3. నడిగూడెం, 4. అగిరిపల్లి, 5. కోలవెన్ను, 6. గందిగుంట్లు, 7. చంద్రాల, 8. చింతలపాడు, 9. జగ్గయ్యపేట, 10. కాలవపాము లల్లో మొత్తం పది పెద్ద రకం సంఘాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఇవికాక, దిగువ ప్రదేశాలలో అట్టివి మరొక 11 ఏర్పాటు కావడానికి ప్రతిపాదనలు వున్నాయి. అవి ఏర్పాటయే ప్రదేశాలు యివి: 1. కొణకంచి, 2. పోలవరం, 3. కూనపరాజుపర్వ. 4. వుయ్యూరు, 5. నున్న, 6. వేలేరు, 7. గన్నవరం, 8. విస్సన్నపేట, 9. [illegible], 10 [illegible] పాడు, 11. కనుమోలు.

మానికొండలో ఒక గ్రామీణ బ్యాంకి ఏర్పాటయింది. దాని విషయంలో ఒకసీనియరు ఇనస్పెక్టరు వుచితంగా పనిచేసే అవకాశాన్ని ప్రభుత్వం కల్పించింది. ఈ పెద్ద రకం సంఘాలు, గ్రామీణ బ్యాంకి కలిసి యిప్పుడు తమ తమ సభ్యులికి అవసరమైన మేరకి పూర్తిగా పెట్టుబడి పెట్టగలుగుతున్నాయి. ఈ విధంగా విపరీతమైన వడ్డీని రాబట్టే ఋణదాతల పిడికిలి నుంచి ఆ సంఘ సభ్యులికి విముక్తి లభించింది. ఈ సంస్థలు రైతులికి కూడా వారి స్వల్పకాలిక అవసరాలకై పెట్టుబడి పెట్టగలుగుతున్నాయి.

ఇంత వరకూ స్వల్పకాలిక ఋణాల క్రింద రూ 164 లక్షలు, మధ్యకాలిక ఋణాల క్రింద రూ 14 లక్షలు యివ్వబడినవి. భూమి అభివృద్ధి, పంపుసెట్ల యేర్పాటు ఫిల్టరుపాయింటు గొట్టపుబావుల నిర్మాణాలకి పల్లె ప్రజల కవసరమైన దీర్ఘకాలిక ఋణాల విషయంలో, నందిగామ, విజయవాడ, గన్నవరం, నూజవీడు, వుయ్యూరులలోని ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులు తోడుపడుతున్నాయి.

సరుకును నిలవ చేయుటకు, దానిని మండీ కేంద్రాలకి చేర్చుటకు తగిన సౌకర్యాలు లేకకూడా గ్రామ ప్రజలు యిబ్బంది పడుతున్నారు. ఈ చిక్కును తొలగించుటకు గిడ్డంగులను నిర్మించుటకై దిగువ మార్కెటింగు సొసైటీలకి అనుమతి యివ్వబడింది :

| | అప్పు | సబ్సిడీ | సొసైటీలు భరించే ఖర్చు |
|---|---|---|---|
| 1. దక్షిణ వల్లూరు | 15,000 | 7,500 | 7,500 |
| 2. జగ్గయ్యపేట | 25,000 | 12,500 | 12,500 |
| 3. ఆత్కూరు | 20,000 | 10,000 | 10,000 |

ఇది కాక, కోలవెన్ను పెద్దరకం సంఘానికి రూ. 15,000/- అప్పు. రూ. 7,500/- సబ్సిడీ మంజూరు చేయబడ్డాయి. దక్షిణ వల్లూరు సహకార మార్కెటింగు సొసైటీకి కూడా చెరకు మరస్థాపన నిమిత్తం రూ. 5,000/- అప్పు మంజూరు చేయ బడింది.

మంజూరైన పై అప్పులోసగం, సబ్సిడీలో సగం అప్పుడే తీసుకొన బడినవి. దక్షిణ వల్లూరు సహకార మార్కెటింగు సొసైటీకి మంజూరు చేయబడిన అప్పు రూ. 5,000/- కూడా పూర్తిగా తీసుకోబడింది.

ఈ సహకార మార్కెటింగు సొసైటీలు, పెద్ద రకం సంఘాల ఆర్థిక వ్యవస్థని పటిష్ఠం చేయుటకై ప్రభుత్వం దిగువ మొత్తాలను, వాటా మూలధనం విషయంలో అప్పుగా మంజూరు చేసింది.

| | |
|---|---|
| 1. సహకార మార్కెటింగు ఫెడరేషన్ | 50,000/- |
| 2. కృష్ణాజిల్లా సహకార మార్కెటింగు సొసైటీ | 10,000/- |
| 3. నూజవీడు సహకార ,, | 10,000/- |
| 4. జగ్గయ్యపేట ,, ,, | 10,000/- |
| 5. దక్షిణ వల్లూరు ,, ,, | 10,000/- |
| 6. తిరువూరు ,, ,, | 10,000/- |
| మొత్తం | 1,00,000/- |

కుటీర పరిశ్రమల సంఘాల్ని పునరుద్ధరించాలని ప్రణాళిక ఆశయం. దాని ననుసరించి దిగువ కుటీర పరిశ్రమల సంఘాలు రిజిస్టరు చేయబడినవి:

1. కొండపల్లి బొమ్మల పారిశ్రామికుల సహకార సంఘం.
2. అడివి నెక్కలం వడ్రంగుల కుటీర పరిశ్రమల సహకార సంఘం.
3. నూజవీడు చర్మకార (తోలుపదును) పారిశ్రామికుల సహకార సంఘం.
4. గంపలగూడెం చర్మకార (చెప్పులు తయారీ) పారిశ్రామికుల సహకార సంఘం.
5. మహిళా కుటీర పరిశ్రమల సహకార సంఘం, వెంకటాద్రి పురం.
6. ,, ,, వేలేరు.
7. నూజవీడు యిటుకలు, పెంకుల తయారీ సహకార సంఘం.

రాజుపేటలో యిటుక పనివారి సహకార సంఘం రిజిస్టరీకై ప్రతి పాదనలు వున్నాయి.

ఈ ప్రాంతంలోని కొన్ని ప్రదేశాలలో సహకార గృహ నిర్మాణ సంఘాలు పని చేస్తున్నాయి. వాటి కృషివల్ల యిళ్లకొరత తీరటమే కాక మధ్యతరగతి ప్రజలు గృహాలను నిర్మించు కొనుటకు అవకాశం కూడా లభిస్తుంది. 1957-58 లో వాటికి మంజూరై తీసుకో బడిన మొత్తాల వివరాలు యివి :

| | పట్టణ ప్రాంతం | తక్కువ రాబడి వర్గం |
|---|---|---|
| 1 విజయవాడ గృహనిర్మాణ సంఘం | 25,800 | 17,400 |
| 2 గాంధీ గృహనిర్మాణ సంఘం | 500 | — |
| 3 చిట్టి డిటో | — | — |
| 4 వుయ్యూరు డిటో | 5,000 | — |
| 5 గన్నవరం డిటో | 750 | — |
| 6 జగ్గయ్యపేట డిటో | — | — |
| | 80,000 | 2,35,000 |

## గ్రామీణ గృహ వసతి

| | | |
|---|---|---|
| 7. | అగిరిపల్లి | 450 |
| 8 | విస్సన్నపేట | 13,350 |
| 9 | నందిగామ | 2 2[illegible]0 |
| 10 | కంచికచెర్ల | — |
| | | 10,000 |

సహకార వ్యవసాయానికి మిక్కిలి ప్రాధాన్యత యివ్వబడుతున్నది. ఈ పథకాన్నమలు పరచుటకై విన్నగడపలో ఒక సమిష్టి వ్యవసాయ సంఘం రిజిష్టరు చేయబడింది. వేలేరులో మరొక దాని రిజిస్ట్రీకి అనుమతి యివ్వబడింది. బ్లాకు ఫండు నుంచి వేలేరు సమిష్టి వ్యవసాయ సంఘానికి రూ 80,000 యివ్వాలని సంకల్పించబడింది.

ఒకానొక ప్రసిద్ధ రచయిత అన్నట్టుగా "సహ[illegible]" ఈ ఆశయ సిద్ధికై, ప్రభుత్వం చేస్తున్న వివిధ రకాల సహాయాన్ని గురించి వివరిస్తూ, దానిని చక్కగా వినియోగించుకోమని ప్రజలకు బోధించుటకె ప్రభుత్వ శాఖ గటిగా కృషిచేస్తున్నది.



# తూర్పు గోదావరి

తూర్పు గోదావరి జిల్లా విస్తీర్ణం 5,788 చ. మైళ్లు. జనాభా రమారమి 24 లక్షల 15 వేలు. దానిలో పురుషుల సంఖ్య 12 లక్షల 6 వేలకిపైన. స్త్రీల సంఖ్య 12 లక్షల 8 వేలకి పైన.

ఈ జిల్లా యేజన్సీ ప్రాంతం విస్తీర్ణం 3,064 చ. మైళ్లు. దాని జనాభా రమారమి 2 లక్షల 58 వేలు. దానిలో పురుషుల సంఖ్య లక్షా నాలుగు వేలకి పైన. స్త్రీల సంఖ్య లక్షా మూడు వేలకిపైన

ఈ జిల్లాలో మొత్తం 13 తాలూకాలున్నాయి. వాటి పేర్లు యివి: రాజమండ్రీ. రామచంద్రపురం, రాజోలు, కాకినాడ, తుని, భద్రాచలం, అమలాపురం, పెద్దాపురం, పిఠాపురం, రంపచోడవరం, ఎల్లవరం, నాగూరు, కొత్తపేట.

ఈ జిల్లా 'మొత్తం భూవైశాల్యం 36,36,573 యెకరాలు' దానిలో 13,35,132 యెకరాలుఅడవి. 5,25,791 యె. సాగులాయకుగాని భూమి. 7,09, 614 యె. సాగు క్రింద లేని భూమి. 1954-55లో సాగు క్రింద వున్న నికరం భూమి. 10,66,463 యెకరాలు.

## దర్శనీయమైన స్థలాలు

### పిఠాపురం

ఇక్కడ గల కుక్కుటేశ్వర స్వామి దేవాలయంలో ప్రతి యేటా వుత్సవాలు జరుగుతాయి. ఇవి మహా శివరాత్రికి 15 రోజులు ముందు ఆరంభమై శివరాత్రి వరకూ జరుగుతాయి. ఈ సందర్భంలో యిక్కడికి రమారమి 50 వేల మంది యాత్రీకులు వస్తారు. ఇది కాశీ తరవాత కాశీ అంతటిదిగా పరిగణించబడుతుంది. పిఠాపురం మద్రాసు-కలకత్తా ప్రధాన రైలు మార్గంలో వుంది.

ఇక్కడ వున్న పిఠాపురం మహారాజా సౌధం యిప్పుడు ఖాళీగా వుంది. ఇక్కడ ఒక పంచదార ఫ్యాక్టరీ కూడా వుంది

### ముమ్మిడివరం

బాలయోగి ఆశ్రమం వెలిసిన కారణంగా యిటీవల కొన్ని సంవత్సరాల నుంచి దీనికి మత విషయికమైన ప్రాముఖ్య మేర్పడింది. ఇక్కడి బాలయోగి సంవత్సరానికి ఒకే ఒకసారి, మహా శివరాత్రి వెళ్లిన మరునాడు ప్రజలకి దర్శనమిస్తారు. అప్పుడు ఆయన దర్శనార్థమై అక్కడికి వేలాది ప్రజలు చేరుతారు. బాలయోగి సంవత్సరం పొడుగునా ఆహార పానీయాలు వర్జించి తపస్సమాధిలో వుంటారు. ఆయన యువకుడు. ఇరవై సంవత్సరాల లోపు వయస్సులోనే ఆధ్యాత్మిక శక్తిని ఆర్జించారు.

ఈ యోగి ఆశ్రమం తూర్పు గోదావరి జిల్లా డెల్టా ప్రాంతంలో జిల్లా ముఖ్యపట్నమైన కాకినాడకి యించుమించు 40 మైళ్ల దూరంలో వుంది. కాకినాడ నుంచి కోటిపల్లికి యెప్పుడూ బస్సులు నడుస్తూ వుంటాయి. ముమ్మిడివరం వెళ్లే ప్రయాణీకులు కోటిపల్లిలో బస్సు దిగి బోటులో గోదావరిని దాటి ముక్తేశ్వరం వెళ్లి అక్కడి నుంచి బస్సులో ముమ్మిడివరం వెళ్లాలి.

వెంకటాపురం దట్టమైన అడవికి ప్రసిద్ధి. ఈ ప్రాంతంలో పెద్దపుల్లు, చిరుతపుల్లు చాలా యెక్కువ. అవి సాధారణంగా కాల్చి చంపబడుతూ

వుంటాయి. ఈ విషయంలో కాశీరేవు, సూడిబాకలు ముఖ్య కేంద్రాలు.

మధ్యప్రదేశ్‌లోని బస్తర్ సరిహాలోద్దు వున్న తాలూకా పశ్చిమ కొసని గల వాగుపై ఒక కర్ర వంతెన వుంది. దానికి లొట్టిపిట్ట గండి అని పేరు. ఆ గండికి వెళ్ళే ఘాట్‌రోడ్ మీద ప్రయాణం చేసేప్పుడు తోవ పొడుగునా చక్కని ప్రకృతి దృశ్యాల్ని తిలకించవచ్చు.

## అన్నవరం

శ్రీ వీరవెంకట సత్యనారాయణ స్వామి దేవాలయం అన్నవరం కొండ మీద వుంది. స్వామి దర్శనార్థం సంవత్సరం పొడుగునా అన్ని ప్రదేశాల నుంచి యిక్కడికి యాత్రీకులు వస్తారు. ప్రతియేటా వైశాఖ మాసంలో వుత్సవాలు జరుగుతాయి. అప్పుడు యిక్కడికి యించుమించు 50 వేల మంది ప్రజలు వస్తారు. ఈ వూరు మద్రాసు కలకత్తా ప్రధాన రైలు మార్గంలో కాకినాడకి 26 మైళ్ల దూరంలో వుంది.

## రాజమండ్రీ

ఇది గొప్ప చరిత్ర ప్రాముఖ్యం గల పట్నం. దీనికి మత విషయికమై కూడా అంతే ప్రాముఖ్యమున్నది. రాజమండ్రీ పూర్వం యీ ప్రాంతాన్ని పరిపాలించిన రాజరాజనరేంద్రుని రాజధాని. దీనికి 3 మైళ్ల దూరంలో సారంగధరుని మెట్టవుంది. అక్కడ శిధిలాల్ని నేటికీ చూడవచ్చు. స్వర్గీయ శ్రీ కె. వీరేశలింగం పంతులు, శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం, శ్రీ గురజాడ అప్పారావుల వంటి గొప్ప గొప్ప రచయితల వుద్భవానికి కారణ భూతమైన భారతాన్ని ఆది కవి నన్నయ భట్టారకుడు యిక్కడే రచించాడు.

గోదావరీ నది వల్ల మత దృష్ట్యా కూడా దీనికి ప్రాముఖ్య మేర్పడింది. పవిత్ర గోదావరి యిక్కడ యేడుపాయలుగా చీలుతుంది. గోదావరికి సమీపంలోనే కోటి లింగేశ్వర స్వామి ఆలయమున్నది. గోదావరి దేశంలోని పవిత్రతమమైన నదులలో ఒకటిగా పరిగణించబడుతుంది. గోదావరీ స్నానం కోసం చాల మంది యాత్రీకులు యిక్కడికి వస్తారు. 12 సంవత్సరాల కొకసారి గోదావరి పుష్కరాలు జరుగుతాయి. అప్పుడు రాజమండ్రీ లక్షలాది యాత్రీకులతో కిటకిట లాడుతూవుంటుంది.

ఇది మద్రాసు-కలకత్తా ప్రధాన రైలుమార్గంలో కాకినాడకి రమారమి 40 మైళ్ల దూరంలో వుంది.

## కాకినాడ

కాకినాడ తూర్పు గోదావరి జిల్లా ముఖ్య పట్నం. ఇక్కడ ఒక సముద్ర రేవు వుంది. ఇక్కడ నుంచి యెగుమతి, దిగుమతి వ్యాపారం బాగా జరుగుతుంది. జిల్లా శాఖాధిపతుల కార్యాలయాలన్నీ యిక్కడ వున్నాయి.

దక్షిణ రైల్వేలో మద్రాసు-కలకత్తా ప్రధాన మార్గంలో గల సామర్లకోట నుంచి బయలుదేరే బ్రాంచి లైనులో ఉంది కాకినాడ. ప్రధాన మార్గంలోని రైళ్లన్నిటిని సామర్లకోట నుంచి కాకినాడకి కలపడానికి వేరే రైళ్లున్నాయి.

సామర్లకోటలో పూర్తి వికాసం చెందిన ఒక విస్తరణ శిక్షణా కేంద్రం, ఒక పెద్ద వ్యవసాయ క్షేత్రం వున్నాయి.

## భద్రాచలం

భద్రాచలం తాలూకాలో మత ప్రాధాన్యం కల ప్రదేశాలు 6 వున్నాయి. 1. భద్రాచలం, 2. దుమ్ముగూడెం, 3. పటపాక, 4 పర్ణశాల, 5. శ్రీరామగిరి, 6. గుండాల. ఇవన్నీ రామాయణానికి సంబంధించినవి. ఈ ప్రదేశాలన్నీ సుప్రసిద్ధమైనవి కాబట్టి వాటిని గురించి మళ్లీ వివరించడం అనవసరం.



రెవెన్యూ శాఖ మంత్రి
శ్రీ కళా వెంకటరావు
(కొత్తపేట)



విద్య, సాంఘిక సంక్షేమ శాఖ
మంత్రి శ్రీ యస్. బి. పి.
పట్టాభిరామారావు
(పామర్రు)



శ్రీ పి. గోపాలకృష్ణ, బి. ఏ.
(పిఠాపురం)



శ్రీ బి. లక్ష్మణ స్వామి, బి. ఏ.
అల్లవరం (రిజర్వుడు)



శ్రీ మహమ్మద్ తహసిల్
భద్రాచలం (జనరల్)



శ్రీ పి. సత్యనారాయణ
(సామర్లకోట)



శ్రీమతి సి. వాణిరమణారావు
భద్రాచలం (రిజర్వుడు)



రాజా రామచంద్రరాజు
(రామచంద్రపురం)



శ్రీ జి. నరసింహమూర్తి
అమలాపురం (జనరల్)



శ్రీ గం.. నాగేశ్వరరావు
(రాజోలు)



రాజా వత్సవాయ వెంకటకృష్ణ
రాజాబహదూర్ (తుని)



శ్రీ తేతల లక్ష్మీనారాయణరెడ్డి
(అనపర్తి)

# ఆంధ్రప్రదేశ్‌లో భూమిశిస్తు సంస్కరణలు

ప్రభుత్వం నియమించిన భూమిశిస్తు సంస్కరణల
కమిటీ ప్రజాభిప్రాయ సేకరణకై తయారు చేసిన ప్రశ్నావళి.

రాష్ట్రములోని వివిధ ప్రాంతాలలో అమలులో నున్న భూమి శిస్తు రేట్లలోను, నీటి పారుదల పన్నులలోను చాల పెద్ద తేడాలు కలవు. దీనికి కొంత వరకు కారణము వివిధ కాలములలో, వివిధ ప్రదేశాలలో, పన్ను విధింపు వివిధ పద్ధతులలో జరిగియుండుటయే. అందువల్ల, రాష్ట్రములోని వివిధ ప్రాంతాలలో అమలులో నున్న భూమి శిస్తు, నీటి పన్ను రేట్లను విధించే పద్ధతులను పరిశీలించి, వాటిని క్రమ పద్ధతిని రూపొందించుటకు తగిన సిఫారసులు చేయు నిమిత్తము ప్రభుత్వము వారు ఒక కమిటీని నియమించినారు.

రాష్ట్రములోని ఉభయ ప్రాంతాలలో రెండేసి జిల్లాలలో పర్యటించి ఉభయప్రాంతాలలోను అమలులోవున్న సెటిల్మెంటు అనగా బందోబస్తు పద్ధతులను పరిశీలించి, భూస్వామ్యము, నీటిపారుదల, వ్యవసాయమునకు సంబంధించిన ప్రస్తుత సమస్యలను తెలిసికొన్న తర్వాత ఈ సంఘము వారు యీ దర్యాప్తుకు సంబంధించిన సమాచారము నంతటిని సేకరించు నిమిత్తము ఈ ప్రశ్నావళిని విడుదల చేయుచున్నారు. భూమి శిస్తులను, నీటి పన్నులను విధించు విషయంలో ఉభయ ప్రాంతాలకును తగిన సక్రమ పద్ధతిని రూపొందించుటలో ఆసక్తిగల వ్యక్తులు, సంస్థలు, సంఘములు, ఈ ప్రశ్నావళిలోని ప్రశ్నలకు సమాధానము వ్రాసి సాధ్యమైనంత శీఘ్రముగా, 15-6-1958 తేదీ దాటకుండా సంఘ కార్యదర్శి రెవిన్యూ బోర్డు బిల్డింగ్సు, నాంపల్లి స్టేషన్ రోడ్డు, హైదరాబాదుకి పంపించ ప్రార్థన. ఆసక్తిగల వ్యక్తులు, సంస్థలు, సంఘములు, సాధ్యమైనన్ని యెక్కువ ప్రశ్నలకు సమాధానము లియ్యవలసినదనీ, యీ ప్రశ్నావళిలో పేర్కొనక పోయినప్పటికిని, విచారణీయాంశముల క్రిందవచ్చు విషయములకు సంబంధించినవే అని తాము భావించునట్టి మరే యితర విషయములనైనా కూడ తమ తమ అభిప్రాయములుగా వ్రాసి పంపవలయునని ప్రార్థన.

## మొదటి భాగము

### కమతపు వివరములు.

ప్రశ్న 1.—

మీకు భూమి ఉన్నది ఆంధ్ర ప్రాంతములోనా? తెలంగాణా ప్రాంతములోనా? ఆంధ్ర ప్రాంతములో అయితే 1908 సం. ఎస్టేటు భూమి చట్టములో నిర్వచింపబడిన రీతిగా మీరు పట్టాదారా, ఇనాందారా, లేక భూస్వామా లేక యెవరు? తెలంగాణా ప్రాంతములో అయితే పట్టాదారా, ఖిల్మక్తాదారా హిస్సేదారా, షిక్మీదారా, కౌలుదారా, రక్షిత కౌలుదారా లేక యెవరు?

ప్రశ్న 2:—

దయచేసి మీ భూముల వివరములను ఈ దిగువ నమూనాలో వ్రాసి తెలియచేయండి.

| గ్రామము, తాలూకా, జిల్లా పేర్లు | రైత్వారి, జమీందారి లేక భూఖామందు యొక్క స్వంతకమతము లేక ఇనాము ఎస్టేటు | సర్వేనెంబరు లేక నెంబర్లు మరియు సబ్ డివిజను. | విస్తీర్ణము ఎకరాలు లేక గుంటలు, సెంట్లు | మాగాణి (నీటి వనరు పేరు, స్వభావము, వర్షాధారపు చెరువా, నది క్రింద కాలువా లేక చెరువా)? మెట్ట/బాగాయత్/మానావారి లేక అస్మాకసరి. | ఆంధ్ర ప్రాంతంలో భూమి తరగతి. రకము, తెలంగాణా ప్రాంతంలో ఉండు మట్టి భూములు రేగడిభూములు. ఎఱ్ఱ చెల్క భూములు. | ఎకరమునకు చెల్లించు శిస్తు. | చెల్లించుచున్న శిస్తు. నీటి పన్ను; ల్యాండు సెస్సు, వగైరాల వివరములు. |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| | | | | | | | |

| 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| --- | --- | --- | --- | --- | --- |
| ప్రతి సర్వేనెంబరు లేక సబ్ డివిజనులో మామూలుగా పండించు పంటలు, పైరు పంటలు మరియు పచ్చి ఎరువు పంటలు. | శిస్తు మరియు నీటి పన్ను విషయములో ముజరా (మాఫీ) ఇచ్చిన సంవత్సరాల వివరాలు, అందులకు కారణములు. | సర్వేనెంబరు లేక సబ్-డివిజనులలో ఉన్నట్టి భావులు లేక స్వంత చెరువుల వివరములు మరియు నీటి పారుదల నిమిత్తము నీటిని తోడుటకు అవలంబించిన సాధనము-పికోటా, ఏతాము, మోట లేక డీసెల్ నూనెతోగాని విద్యుచ్ఛక్తితో గాని నడిపించు ఇంజను | స్వంత పశువుల సంఖ్య వాటి ఖరీదు లేక వెల (ఎ) పనికి ఉపయోగించు పశువులు. (బి) పాడి పశువులు. (సి) గొర్రెలు. (డి) మేకలు | భా[illegible] ఉండు [illegible] (జీతగాండ్లు) సంఖ్య, వాటికి నగదు రూపంలోగాని, ధాన్యం లేక ఇతరవస్తు రూపంలోగాని ఇచ్చు జీతాల వివరాలు. | షరా. |
| | | | | | |

ప్రశ్న 3:—

ప్రభుత్వముచే రద్దు చేయబడి స్వాధీనము చేసి కొనబడిన ఎస్టేటులలో లేక జాగీరులలో ఉన్నట్టి భూములైనచో, ప్రతి కమతము లేక సబ్ డివిజను పై భూశిస్తుకు, ఇనాముదారుకు లేక జాగీరు దారుకు చెల్లించిన శిస్తు వివరములను తెలుపవలెను. ఎస్టేటులేక జాగీర్లు రద్దుఅయిన తర్వాత ప్రభుత్వము నకు చెల్లించిన తగ్గింపు శిస్తు వివరములను తెలుప వలెను. ఈ లోగా సెటిల్మెంటు రేట్లు అమలు చేసిన యెడల దయచేసి మీ కమతమునకు నిర్ణయింపబడిన మొత్తము శిస్తు ఎంతో తెలుపుడు ?

ప్రశ్న 4·—

మీ భూములకు నీటిపారుదల లభిస్తున్నది యేక పంట మాగాణీ పైర్లకా లేక రెండు పంటల మాగాణీ పైర్లకా? వాటిపై ఏకము చేయబడిన మొత్తపు మాగాణి శిస్తు విధింప బడుచున్నదా ? లేక మెట్ట శిస్తు మరియు నీటిపన్ను విడి విడిగా విధింప బడుచున్నదా? నీటి పన్ను లేక ఫస్లిజాస్తి ఏ రేటు చొప్పున విధింప బడుచున్నది ?

ప్రశ్న 5:—

(ఎ) మీ ప్రాంతంలో వివిధ రకముల వ్యవసాయ భూముల విలువ ఎంత ?

(బి) రిజిస్టరు చేయబడిన క్రయదస్తావేజులలో తెలుపబడిన విలువలు సరియైనవే అని భావించ వచ్చునా ?

(సి) లేనిచో, సరియైన విలువలను నిర్ధారణ చేయుట ఎట్లు ?

## రెండవ భాగము

### సేద్యపు ఖర్చులు, వ్యవసాయమునకు సంబంధించిన ఆర్థిక విషయములు

ప్రశ్న 1:—

మీ భూములలో పండించు యేకపంట, రెండు పంటల మాగాణి పంటలు, ఆరుతడి మెట్టపంటలు, తోటపైర్లు (బాగాయత్) పైరుపంటలు, పచ్చి ఎరువు పంటలు ఏవి?

ప్రశ్న 2:—

మీ ప్రాంతములోని ఈ క్రిందిరకపు భూములలో ఏ పంటల విషయంలో మార్పు (Rotation) పద్ధతిని అనుసరించు చున్నారు ?

(ఎ) మాగాణి భూములు.

(బి) ఒండుమట్టి భూములు.

(సి) నల్లరేగడి భూములు.

(డి) ఎర్ర చెల్కలు.

(ఇ) బావులక్రింద లిఫ్టు ఇరిగేషన్ ద్వారా సాగగు భూములు.

(ఎఫ్) లైట్ ఇరిగేషన్ క్రింది భూములు (light irrigation

(జి) ఊట కాల్వల క్రింద సాగగు భూములు

గమనిక: దయచేసి మీ ప్రాంతములోని ప్రతి రకపు భూమిలోను పంట మార్పునది 2, 3, 4 లేక 5 సంవత్సరముల కొకసారా? మీ ప్రాంతంలో అమలులో వున్న పంటల మార్పుకును మీరు అనుసరించుచున్న పంటల మార్పు పద్ధతికి తేడావున్న తెలుపుడు. అట్టి తేడాకుగల కారణములు కూడా వ్రాయండి.

ప్రశ్న 3:—

దయచేసి సేద్యపు ఖర్చుల వివరాలు, భూమి శిస్తు, నీటిపన్ను, ల్యాండు సెస్సు మరియు ఈ క్రింది చట్టముల క్రింద చెల్లింపబడు పన్నులను విడివిడిగా తెలుపుడు.

1. ఆంధ్రప్రదేశ్ వ్యాపారపంటల అసెస్మెంటు చట్టము, 1957.

2. ఆంధ్రప్రదేశ్ భూమి శిస్తు (సర్చార్జి) చట్టము, 1957.

3. ఆంధ్రప్రదేశ్ భూమి శిస్తు (అదనపు మాగాణి అసెస్మెంటు) (ఆంధ్రప్రదేశ్ సవరణ) చట్టము, 1957.

మే, 1958

4. ఆంధ్రభూమి అసెస్మెంటు (ప్రమాణీకరణ) చట్టము 1956.

బాగుగా పండినప్పుడును మరియు సామాన్యముగా పండినప్పుడు పంట పరిమాణమును ఈ క్రిందనమూనాలో వ్రాయుడు. ఇప్పటి మార్కెటు ధర చొప్పున ఆపంట విలువను తెలుపుడు. పంటల పరిమాణమును ఇంపీరియల్ మణుగులతోను 80 తులాల శేర్లలోను తెలుపుడు.

గమనిక ఈ ప్రశ్నావళికి సమాధానమిచ్చు వ్యక్తి లేక సంస్థ పండించునట్టి ఒక్కొక్క పైరుకు ఒక్కొక్క నమూనాను ఉపయోగింపవలెను.

పసుగ్రాసము పైర్లు, పచ్చియెరువు పైర్లు, పైరుపంటలు ( catch crop ) మిశ్రమ పంటలు పండించు వివరాలుకూడా తెల్పుడు. ఈ ఖర్చులలోకుటుంబములోని వారు చేసిన కాయకష్టపు విలువను కూడా అప్పటి ధర ప్రకారము చేర్చుడు.

కూలీ ఖర్చులనువాస్తవముగా చెల్లించిన రేట్ల ప్రకారము తెలుపవలెను. ఈ వివరములు రైతు వీలునుబట్టి పండించిన ప్రతిపైరుయొక్క మొత్తం విస్తీర్ణం మీదగాని లేక ఒక ఎకరమునకు గాని తెలుపవచ్చును.

నమూనా

| | పంట (in kind) దాని దిగువ నగదు విలువ కూడా తెల్పుడు | రొక్కము | మొత్తము (2 3, కాలముల మొత్తము రూ॥) | షరా |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| (ఎ) ప్రారంభ సేద్యము: దున్నుట. | | | | |
| (బి) విత్తనములు వేయుట, (ఎకరమునకెన్ని శేర్లు) గొర్రుతో విత్తుట, వరుసగా విత్తనములు చల్లుట, నారు నాటుట లేక నారు మడివిషయములో నారుమడికి అయిన ఖర్చులను వేరుగా వ్రాయుడు | | | | |
| (సి) కలుపు తీయుట: పశువుల ఉపయోగమునకును, కాయకష్టమునకును అయిన సుమారు ఖర్చును విడి విడిగా తెల్పుడు. పనిలో నియమించిన కూలీల సంఖ్యను, కూలీరేట్లను తెల్పుడు. చేసిన పనినిబట్టి కూలీ చెల్లించిన సందర్భములో ఆ షరతులను పేర్కొనుడు. | | | | |
| (డి) ఎరువులు వేయుట: పశువుల ఎరువు, గోతి ఎరువు గొర్రెలను మందకట్టుట, ఒండు మట్టితోలుట, పచ్చి ఆకులు వేయుట, పొలములోనే పచ్చి ఎరువు పెంచుట లేక పంట వేయునప్పుడు పంట పెరుగునప్పుడు రసాయనిక ఎరువులు వేయుట. (ఇట్లువేసిన ప్రతీదాని విషయములోను అయిన ఖర్చును, తరుణమును, పద్ధతిని తెలుపుము). | | | | |

| | పంట (in kind) దాని దిగుబడి నగదు విలువ కూడా తెల్పుడు | రొక్కము | మొత్తము (2 3, కాలముల మొత్తము రూ॥) | పరా |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| (ఇ) నీటి పారుదల: పద్ధతి: (ప్రభుత్వపు నీటి వనరునుండి పారుదల మూలముగానా ? లేక బావిలో నుండి తోడుట ద్వారానా ?.) (మొదటిదాని విషయములో నీటి పారుదలకు చెల్లించు రేటును రెండవ దాని విషయములో నీరు తోడినందుకు అయిన ఖర్చును తెలుపుడు). | | | | |
| (ఎఫ్) పంటను కాపాడుటకు తీసికొను చర్యలు: నీటి పంపకము, పక్షులను బెదరకొట్టుట, కావలా. | | | | |
| (జి) సస్య రక్షణ: వివిధములైన చీడలులేక పంట తెగుళ్ళను పేర్కొనుడు. మీరు అవలంబించిన రక్షణ చర్యలకు అయిన ఖర్చు తెలుపుడు. రక్షణ చర్యలు అవలంబించినప్పటికీ కలిగిన సుమారు నష్టమెంత ? | | | | |
| (హెచ్) కోత: పద్ధతులు, ఖర్చు. | | | | |
| (ఐ) నూర్పు: పద్ధతులు, చేతి నూర్పుడా ? లేక పశువుల వలననా ? అందుకు ఖర్చు. | | | | |
| (జె) గాదెలకు రవాణాచేయుటకు ఖర్చు. | | | | |
| 2. (ఎ) పండిన మొత్తము పంట—ఇంపీరియల్ మణుగులు శేర్లలో—దాని నగదు విలువ. | | | | |
| (బి) గడ్డివంటి వుపవస్తువుల మొత్తము నగదు విలువ. | | | | |

నమూనా

| | పంట (in kind) దాని దిగుబడి నగదు విలువ కూడా తెల్పుడు | రొక్కము | మొత్తము (2 3, కాలముల మొత్తము రూ॥) | షరా |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| 1. (ఎ) ప్రారంభ సేద్యము:— దున్నుట. | | | | |
| (బి) విత్తనములు వేయుట:— (ఎకరమునకెన్ని సేర్లు) గొర్రుతో విత్తుట, వరుసగా విత్తనములు చల్లుట, నారు నాటుట లేక నారు మడి విషయంలో నారు మడికి అయిన ఖర్చులను వేరుగా వ్రాయుడు. | | | | |
| (సి) కలుపు తీయుట:— పశువుల ఉపయోగమునకును, కాయ కష్టమునకును అయిన సుమారు ఖర్చును విడివిడిగా తెల్పుడు. పనిలో నియమించిన కూలీల సంఖ్యను, కూలీరేట్లను తెల్పుడు. చేసిన పనినిబట్టి కూలి చెల్లించిన సందర్భములో ఆ షరతులను పేర్కొనుడు. | | | | |
| (డి) ఎరువులు వేయుట:— పశువుల ఎరువు, గోతి ఎరువు, గొర్రెలను మందకట్టుట, ఒండు మట్టితోలుట, పచ్చి ఆకులు వేయుట పొలములోనే పచ్చి ఎరువు పెంచుట లేక పంట వేయునప్పుడు పంట పెరుగునప్పుడు రసాయనిక ఎరువులు వేయుట. (ఇట్లువేసిన ప్రతిదాని విషయములోను అయిన ఖర్చును, తరుణమును, పద్ధతిని తెలుపుము). | | | | |

నమూనా

| | పంట (in kind) దాని దిగువ నగదు విలువ కూడా తెల్పుడు | రొక్కము | మొత్తము (2 3, కాలముల మొత్తము రూ॥) | |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| (ఇ) నీటి పారుదల:— పద్ధతి, (ప్రభుత్వపు నీటి వనరునుండి పారుదల మూలము గానా ? లేక భావిలోనుండి తోడుట ద్వారానా ?). (మొదటిదాని విషయములో నీటి పారుదలకు చెల్లించు రేటును రెండవదాని విషయములో నీరుతోడినందుకు అయిన ఖర్చును తెలుపుడు). | | | | |
| (ఎఫ్) పంటను కాపాడుటకు తీసికొన్న చర్యలు:— నీటి పంపకము, పక్షులను బెదరకొట్టుట, కాపలా. | | | | |
| (జి) సస్య రక్షణ:— వివిధములైన పంట తెగుళ్ళను పేర్కొనుడు. మీరు అవలబించిన రక్షణ చర్యలకు అయిన ఖర్చు తెలుపుడు. రక్షణ చర్యలు అవలంబించినప్పటికి కలిగిన సుమారు నష్టమెంత ? | | | | |
| (హెచ్) కోత:— పద్ధతులు, ఖర్చు. | | | | |
| (ఐ) నూర్పు:— పద్ధతులు, చేతి నూర్పుడా ? లేక పశువుల వలననా ? అందుకు ఖర్చు. | | | | |
| (జె) గాదెలకు రవాణాచేయుటకు ఖర్చు. | | | | |
| 2. (ఎ) పండిన మొత్తము పంట—ఇంపీరియల్ మణుగులు, శేర్లలో—దాని నగదు విలువ. | | | | |
| (బి) పంట కాకుండ గడ్డి, తదితర వస్తువులు వాటి మొత్తము నగదు విలువ. | | | | |

నమూనా

| | పంట (in kind) దాని దిగువ నగదు విలువ కూడా తెల్పుడు | రొక్కము | మొత్తము (2 3, కాలముల మొత్తము రూ॥) | పరా |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| 1. (ఎ) ప్రారంభ సేద్యము:— దున్నుట. | | | | |
| (బి) విత్తనములు వేయుట:— (ఎకరమునకెన్ని సేర్లు) గొర్రుతో విత్తుట, వరుసగా విత్తనములు చల్లుట, నారు నాటుట లేక నారు మడి విషయంలో నారు మడికి అయిన ఖర్చులను వేరుగా వ్రాయుడు. | | | | |
| (సి) కలుపు తీయుట:— పశువుల ఉపయోగమునకును, కాయ కష్టమునకును అయిన సుమారు ఖర్చును విడి విడిగా తెల్పుడు. పనిలో నియమించిన కూలీల సంఖ్యను, కూలీరేట్లను తెల్పుడు. చేసిన పనినిబట్టి కూలి చెల్లించిన సందర్భములో ఆ షరతులను పేర్కొనుడు. | | | | |
| (డి) ఎరువులు వేయుట:— పశువుల ఎరువు, గోతి ఎరువు, గొర్రెలను మందకట్టుట, ఒండు మట్టితోలుట, పచ్చి ఆకులు వేయుట పొలములోనే పచ్చి ఎరువు పెంచుట లేక పంట వేయునప్పుడు పంట పెరుగునప్పుడు రసాయనిక ఎరువులు వేయుట. (ఇట్లువేసిన ప్రతిదాని విషయములోను అయిన ఖర్చును, తరుణమును, పద్ధతిని తెలుపుము). | | | | |

నమూనా

| | పంట (in kind) దాని దిగువ నగదు విలువ కూడా తెల్పుడు | రొక్కము | మొత్తము (2 3, కాలముల మొత్తము రూ॥) | షరా |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| (ఇ) నీటి పారుదల:— పద్ధతి, (ప్రభుత్వపు నీటి వనరునుండి పారుదల మూలము గానా ? లేక భావిలోనుండి తోడుట ద్వారానా ?). (మొదటిదాని విషయములో నీటి పారుదలకు చెల్లించు రేటును రెండవదాని విషయములో నీరుతోడినందుకు అయిన ఖర్చును తెలుపుడు). | | | | |
| (ఎఫ్) పంటను కాపాడుటకు తీసికొన్న చర్యలు:— నీటి పంపకము, పక్షులను బెదరకొట్టుట, కాపలా. | | | | |
| (జి) సస్య రక్షణ:— వివిధములైన పంట తెగుళ్ళను పేర్కొనుడు. మీరు అవలబించిన రక్షణ చర్యలకు అయిన ఖర్చు తెలుపుడు. రక్షణ చర్యలు అవలంబించినప్పటికి కలిగిన సుమారు నష్టమెంత ? | | | | |
| (హెచ్) కోత:— పద్ధతులు, ఖర్చు. | | | | |
| (ఐ) నూర్పు:— పద్ధతులు, చేతి నూర్పుడా ? లేక పశువుల వలననా ? అందుకు ఖర్చు. | | | | |
| (జె) గాదెలకు రవాణాచేయుటకు ఖర్చు. | | | | |
| 2. (ఎ) పండిన మొత్తము పంట—ఇంపీరియల్ మణుగులు, శేర్లలో—దాని నగదు విలువ. | | | | |
| (బి) పంట కాకుండ గడ్డి, తదితర వస్తువులు వాటి మొత్తము నగదు విలువ. | | | | |

ప్రశ్న: 4

దున్నుట, ఊడ్పు, కలుపు, కోత, నూర్పు మొదలగు పనులకు ఆయా తరుణములలో నియమింపబడు ఆడ, మగ కూలీలకు ఇయ్యబడు కూలీ రేట్లు, మరియు నాట్లు. కలుపు, "చెరకు మొక్కలు వేళ్లను మట్టితో కప్పుట", కోతలు వివిధములైన పైర్ల నూర్పులు గడ్డిని లేక చొప్ప (Stalks) మొదలైన వాటిని మేటు లేక వాములు వేయుట వంటి పనులకు పనినిబట్టి చెల్లించు రేట్లు తెలుపుడు.

ప్రశ్న 5.

సాలుసరి ప్రాతిపదికపై నియమించుకొన్న జీతగాండ్లు లేక పాలేర్లకు మామూలుగా ఇచ్చు జీతమెంత ?

గమనిక: తిండితో, తిండిలేకుండ ఇచ్చుజీతమును కూడా తెలుపుడు.

ప్రశ్న: 6

(ఎ) ఆయాతరుణములలో నియమించే కూలీల యొక్క,

(బి) సాలుసరి పద్ధతిమీద నియమించే పాలేర్ల లేక జీతగాళ్ల యొక్క

నియామకమును గురించిన వారి లభ్యతను గురించిన సమస్యలు ప్రత్యేకమైనవి ఏవైన ఉన్న ఎడల వాటిని పేర్కొనుడు.

ప్రశ్న: 7

మీ ప్రాంతంలో ఎద్దులజత ఖరీదెంత ? వాటి పోషణఖర్చులు, అవి సామాన్యముగా పనికి ఉపయోగించు కాలపరిమితిని తెలుపుడు.

ప్రశ్న: 8

(ఎ) మీ ప్రాంతంలో వ్యవసాయమునకు కావలసిన వ్యవసాయ పరికరములు ఏవి?

(బి) ఆ పరికరముల ఖరీదెంత? అవి ఎంతకాలము పనికి వచ్చును ?

ప్రశ్న: 9

(ఎ) మాగాణి సాగుకు నీటిని తోడుటకు లేక ఎత్తుటకు మీప్రాంతంలో అమలులోనున్న పద్ధతులు ఏవేవి?

(బి) నీరుతోడు నిమిత్తము మాగాణి పంటలకును, నీరు కావలసిన ఆరుతడి పంటలకును ఎకరము ఒక్కంటికి అగు ఖర్చుఎంత ?

(సి) నీరు తోడుటకై మీ ప్రాంతంలో ఎంత మాఫీ తగ్గింపు లేక బేలింగు రెమిషను ఇయ్యబడుచున్నది.

(డి) ఈ తగ్గింపు చాలునని మీరు భావించుచున్నారా? లేక ఏమైనా మార్పులు మీరు సూచించెదరా?

ప్రశ్న: 10

అడ్డకట్టలు లేక పంపకం (Turn system) ద్వారా కాలువల క్రింద మీ భూములకి నీటి పారుదల లభించు చున్నదా? ఐనచో అడ్డకట్టలు వేయుటకుగాని తీసివేయుటకుగాని అవలంబించుచున్న పద్ధతి ఏది? కట్టలు వేయుటకు తీయుటకు ఎకరము ఒక్కంటికి అగు సగటు ఖర్చు ఎంత?

ప్రశ్న: 11

నదీ గర్భాలలో ఊటకాలువలను త్రవ్వ నిమిత్తము నియమింపబడిన లేక పాల్గొనిన కూలీలకు ఎకరము ఒక్కంటికి అగు సగటు ఖర్చు ఎంత?

## మూడవ భాగము

### భూమి శిస్తు నిర్ధారణ సూత్రములు

ప్రశ్న: 1

మీ అభిప్రాయములో భూమి శిస్తు నిర్ణయించుటకు సరియైన పద్ధతి ఏది?

(ఎ) భూమిలో పండిన మొత్తము పంటను బట్టియా? లేక

(బి) నికరపు పంటను బట్టియా?

ప్రశ్న: 2

మొత్తము పంట పద్ధతియే మంచిదని మీరు భావించినచో అట్టి మొత్తము పంటలో ఎంతశాతము ప్రభుత్వము యొక్క సముచితమైన భాగము కాగలదని మీ అభిప్రాయము?

ప్రశ్న: 3

నికరపుపంట పద్ధతియేమంచిదని మీరు భావించినచో, నికరపు పంట ఎంతో తేల్చుటకుగాను మొత్తము పంటలోనుండి ఏమేమి పద్దులను మినహాయించవలెను? అట్టి నికరపు పంటలో ఎంత శాతము ప్రభుత్వము యొక్క సముచితమైన భాగము కాగలదని మీ అభిప్రాయము?

ప్రశ్న: 4

మాగాణి, మెట్టభూముల నుంచి లభించే ఫలసాయంలో స్వాభావికముగా వ్యత్యాసము లుండును. కావున ఈ శాతములో కూడా వ్యత్యాసము ఉండవలెనని మీరు భావించుచున్నారా?

ప్రశ్న: 5

సెటిల్మెంటు అనగా బందోబస్తు జరిగే సందర్భములలో సెటిల్మెంటుకు పూర్వము కరువు కాటకములు సంభవించని ఇరువది సంవత్సరములలో ఆ ప్రాంతమందలి ప్రామాణిక ఆహార ధాన్యముల

గటు ధరను ఆధారముగా తీసుకొను పద్ధతి అవలంబింపబడుచున్నది.

ఇక ముందు కూడ ఈ పద్ధతినే అవలంబించవచ్చునని మీరు భావించుచున్నారా? లేక దీనిని మార్చవలెనా?

మార్చ వలసియున్నచో, మీరు సూచించెడి మార్పు ఎట్టిది? ఎందుకు?

ప్రశ్న 6:

వ్యాపార పంటల ద్వారా మంచి లాభములు వచ్చుచున్నందువల్ల ఆ పంటలు ప్రస్తుతము విస్తారముగా పండింపబడుచున్నవి. గత బందోబస్తు లేక సెటిల్మెంటులలో వాటిధరలను లెక్కలోనికి తీసికొనలేదు. భూమి శిస్తు విధించుటకుగాను వీటిని లెక్కలోనికి తీసికొనవలెనా? తీసుకొనవలసినచో, ఇప్పటి వలెనే ఇకముందుకూడ ప్రత్యేక శిస్తులను విధించుట కొనసాగించకూడదా? 1957 ఆంధ్రప్రదేశ్ వాణిజ్య పంటల (అసెస్మెంటు) చట్టమును గురించి మీ అభిప్రాయములేమి?

ప్రశ్న 7 :

(ఎ) ముఖ్య ఆహార పంటల యొక్క లేక వ్యాపార పంటల యొక్క ధరల స్థాయికి భూమి శిస్తు సంబంధించి ఉండవలెనని మీ అభిప్రాయమా?

(బి) ఈ పద్ధతిని మీరు అంగీకరించినచో, ఆ సంబంధం శిస్తు చెల్లించవలసిన సంవత్సరమునకు ముందు సంవత్సరమందలి ధరలతో వుండవలెనా లేక మూడు, అయిదు లేదా పది సంవత్సరముల కాలమందలి సగటు ధరలతో వుండవలెనా?

ప్రశ్న 8 :

శిస్తు తగ్గించుటకుగాని పెంచుటకుగాని ఆహార ధాన్యముల ధరల తగ్గుదలలో లేక పెరుగుదలలో ఎంత మార్జిను లేక భాగము ఉంచుట సబబుగా నుండునని మీ అభిప్రాయము? ఉదాహరణమునకు, ధరల తగ్గుదలకు $12\frac{1}{2}\%$, పెరుగుదలకు 25% వరకు మార్జిను ఉంచిన బాగుండునా?

గమనిక: ధరలలో కొద్దిపాటి మార్పులకు మాటిమాటికీ పన్నులలో హెచ్చు తగ్గులు చేయ వలసిన అవసరముండ కుండునట్లుగా ఈ మార్జినును తగినంత స్థూలముగా నుంచవలెను.

ప్రశ్న 9:

ధరలలో 25% వరకు, పెరిగినచో శిస్తును ఎంత హెచ్చిస్తే సబబుగా నుండునని మీ అభిప్రాయము? ఒక్క రూపాయ శిస్తుకు హెచ్చింపవలసిన మొత్తమును నయాపైసలలో తెలుపుడు.

ప్రశ్న: 10

ధరలు హెచ్చిన కారణముగా శిస్తును హెచ్చించుట, ధరలు తగ్గిన కారణముగా శిస్తును తగ్గించుటయు, ఒకే నిష్పత్తి ప్రకారము జరుగ కూడదని మీరు భావించు చున్నారా?

గమనిక:—25% వరకు ధరలు పడిపోయి నప్పుడు శిస్తులో రూపాయకు నాలుగణాలు తగ్గించ వలెనని భావించినచో, ధరలు సబబైన రేటు కంటె 25% వరకు పెరిగినచో శిస్తు పెరుగుదల 25% కంటే తక్కువ అనగా, ఉదాహరణమునకు 12/1/2% ఉండవలెనా?

ప్రశ్న 11 :

ప్రామాణిక ఆహార ధాన్యముల ధర సెటిల్మెంటులో అవలంబించిన మదింపు రేట్లకంటే 25% వరకు తగ్గినచో, శిస్తులో ఎంత తగ్గింపు యుక్తముగా నుండును?

ప్రశ్న 12 :

భూమిపై మాగాణి శిస్తు ఏకము చేయబడ వలెనా? లేక భూసారమును, తదితర అంశములను బట్టి తగిన మెట్ట శిస్తు మరియు నీరు వాడుకొనినందుకు తగిన నీటి పన్ను విడిగా ఉండవలెనా?

ప్రశ్న 13 :

(ఎ) స్థానిక సిద్ధాంతములను, అనుభవమును బట్టి, 60, 30, 10 లేక 5 సంవత్సరముల కాల పరిమితులలో—

(1) సుభిక్షమైన సంవత్సరములు,

(2) అనావృష్టి సంవత్సరములు,

(3) కరువు సంవత్సరములు,

ఏయే క్రమములో ఎన్నిసార్లు వచ్చుచున్నవో తెలుపుడు?

(బి) మెట్ట పంటల విషయములో కూడ వీటి రాకలు ఇదే క్రమములో నున్నవా? లేనిచో దయ చేసి వివరములు తెలుపుడు?

ప్రశ్న : 14

(ఎ) మీ గ్రామము, తాలూకా లేక ప్రాంతము లేక జిల్లాలో ఏ భాగములో నైనను భూమి శిస్తు తక్కువ స్థాయిలో నిర్ణయించబడినదని మీరు భావించుచున్నారా? అయినచో మీ అభిప్రాయ మునకు కారణములేవి? రైతు తన వృత్తిని సమర్థ వంతముగా కొనసాగించుటకు ఆటంకముగా నుండు భారము అతని పై పడకుండ, ఆ శిస్తులో ఎంత శాతము వరకు పెంచవచ్చునో కూడ దయచేసి తెలుపుడు.

(బి) ఇట్లే ఏ ప్రాంతములోనైనను శిస్తు హెచ్చు స్థాయిలో నిర్ణయించబడినదని మీ అభిప్రాయమా? ఐనచో అట్టి ప్రాంతములను పేర్కొనుచు, కారణ ములను తెలుపుడు. శిస్తులో ఎంత శాతము వరకు తగ్గించవలెనో కూడ తెలుపుడు.

ప్రశ్న : 15

భూమి శిస్తు మీద అంతస్తుల వారిగా విధింప బడుచున్న సర్చార్జీని గురించి మీ అభిప్రాయము లేవి?

## నాలుగవ భాగము

### నీటి పన్నులు, నీటి పారుదల విషయములు

ప్రశ్న : 1

ప్రాజెక్టులు, పెద్ద చెర్వులు, చిన్న చెర్వులు, ఊటలు, చిన్న నదుల నుండి ప్రవహించు కాలవల క్రింద పారుదలకు నీటిపన్ను విధించుట సరియైన పద్ధతి ఏది?

ప్రశ్న : 2

వ్యవసాయమునకు నీరు పొదుపుగా ఉపయోగించుటకును, నీరు వృధా కాకుండుటకును, నీటి పన్ను వాడిన నీటి పరిమాణముపై విధించుట సముచితమని మీరు భావించెదరా?

ప్రశ్న : 3

నీటిపన్ను నిర్ణయించుటలో, నీరు సరఫరా అయిన కాల పరిమితి, నీటి స్వభావములకు (నదీ జలములలో వండు ఎక్కువ వుండును, రిజర్వాయరు నుండి వచ్చు నీటిలో వండు తక్కువ వుండును) ప్రాధాన్యము నివ్వవలెనా?

ప్రశ్న 4·

(ఎ) తూముల దగ్గరగానున్న భూములకు చాలినంతగాను, సకాలములోను, నీరు లభించగలదు, తూములకు దూరముగా నుండు భూములకు అట్లు సకాలములోను, చాలినంతగాను, నీరు లభింపక పోవచ్చును. ఈ తేడా సర్దుబాటు చేయుటకు దూరముగా వుండు భూములకు జలాధారముయొక్క తరగతి తగ్గించుటవలన విధింపబడు నీటిపన్ను సరియైనదని తలచెదరా?

(బి) గోదావరి, కృష్ణా డెల్టాలలో, లాకుకు ఎగువగల కాలువ లాకుకు దిగువగల కాలువ రెండునూ చుట్టుపట్లనున్న దాదాపు ఒకే మట్టపు భూములకు నీటిని సరఫరా చేయుచున్నప్పుడు,

లాకుకు ఎగువ గల కాలువను, దిగువగల కాలువ కంటె ఉన్నత తరగతి నీటి వనరుగా వర్గీకరించుట యుక్తమని మీరు భావించెదరా ?

ప్రశ్న 5:

సరఫరాచేయు నీటి రకము, పరిమాణము ఒకటే అయినను, వివిధ నేలలలో వేర్వేరుగా పంట పండు నను విషయము అందరికి తెలిసినదే. నీటి పన్ను విధించుటలో పంట పరిమాణమునకు ప్రాధాన్యమీయ వలదా ?

ప్రశ్న 6:

మాగాణిగా మార్చుటకు ఎక్కువగా మరమ్మత్తు చేయవసియుండు భూముల విషయములో నీటి పన్ను తగ్గించవలయునా ? ఐనచో అట్టి తగ్గింపును ఎంతకాలమువరకు ఇవ్వవలెను ? క్రమేణా ఆ తగ్గింపు ఏ విధముగా విరమింపబడవలెను ?

ప్రశ్న 7:

(ఎ) సకాలములోను, చాలినంతగాను పొరు దలకు నీటి సరఫరాను పొందుటలోను (బి) సరిఅయిన మురుగు పారుదల సౌకర్యములు లేకపోవుటచేతను మీకుకలుగు ఇబ్బందులు ఏవి ?

పంటను అధికమొనర్చు నిమిత్తము ఆ చిక్కులను తొలగించుటకు మీరుచేయు సూచనలు ఏవి ?

ప్రశ్న 8:

నీరు ముందుగా ఇచ్చుటవలన అధిక ఫలసాయము వచ్చునని నిర్ణయింపబడినపుడు, నీటి పన్ను నిర్ణయించుటలో సరఫరా కాలము కూడ ఒక అంశముగా ఉండవలెనని మీరు భావించెదరా ?

ప్రశ్న 9:

ఏ ప్రాంతంలోనైనా నీటి సరఫరా విషయంలో ప్రభుత్వము వారికి అగు ఖర్చులతో నిమిత్తము

లేకుండా, ఆ నీటి పారుదలవలన కలుగు లాభము నకు మాత్రము అనుగుణముగా పన్ను విధింపబడ వలెనని మీరు భావించెదరా ?

ప్రశ్న 10:

భావి నీటితో వరిసాగుచేయుచు తన పంటకు ఉప కరించు నిమిత్తము వర్షపు నీటిని నిల్వచేయుటకు రైతు చిన్నగట్టును వేయునపుడు, నీటి పన్ను లేదా మాగాణిశిస్తు విధింపబడవలెనని మీరు తలచె దరా ?

అట్టి నీటివనరు క్రింద కొద్ది ప్రదేశము అనగా 1, 2, లేదా 5 ఎకరములు మినహాయింపబడి, ఆ పరిమితి మీరిన భూమికి పన్ను విధింపబడుట యుక్తము కాదా.

వర్షమువల్ల మట్టి కొట్టుకుపోకుండా వుండుటకు ఒక్కొక్కప్పుడు అట్లు నీటిని ఆపడం అవసరమని మీరు తలచెదరా ?

ప్రశ్న 11:

కాలువలలో మేటను లేక బురదను తొలగిం చుటకు రైతులు తరుచుగా పని చేసినగాని ఊట కాలువల క్రింద నీటి పారుదల సాధ్యముకాదు. నీటి విషయములో మామూలు మాగాణి శిస్తు వసూలు చేయబడవలెనని మీరు తలంచెదరా ? అట్లు కానిచో ఎట్టి రాయితీ యివ్వదగును ?

ప్రభుత్వమువారు, తలుపులతో డాముసునిర్మిం చినచో రైతుకు అట్లు చేయవలసిన శ్రమ ఎంత వరకు తగ్గును ?

నీటి వనరు యొక్క నీటి పారుదల శక్తిని మించి. అయకట్టు అమితముగా పెరుగకుండా రివాజుగా మీ ప్రాంతములో అనుసరించు పద్ధతులేవి ?

ప్రశ్న 12:

పెద్ద, చిన్న, వర్షాధారపు చెర్వుల విషయ ములో, పబ్లికు వర్క్సు శాఖవారి సిఫార్సుల ప్రకా

రము ఆయకట్టుకు పరిమితి నిర్ణయింపబడవలెనని మీరు ఒప్పుకొనెదరా ?

నీటి పారుదల అగు విస్తీర్ణము ఎక్కువగా యుండి, నీటి సరఫరా చాలనందున పంటలు తరుచుగా నష్టపడుచున్నందున, రైతులు, బావులను త్రవ్వుకొన వలసి వచ్చిన సందర్భములలో మాగాణి శిస్తు లేదానీటి పన్నులో ఎట్టి రాయితి యుక్తమని మీరు భావించెదరు ?

ప్రశ్న · 13.

10, 20, లేదా 30 ఎకరములకు మించని ఆయకట్టు గల కుంటలు లేదా చిన్న తరహా చెరువుల్ని, వాతావరణ పరిస్థితులు, సాగ చేయబడు విస్తీర్ణముతో నిమిత్తము లేకుండా వాటిపై నిర్ణయింపబడిన సంవత్సర వారీ మొత్తమును చెల్లించే (కేవలము ఆయకట్టు దార్లతో కూడిన) ఇరిగేషను పంచాయతీకి స్వాధీనపరుచుట వాంఛనీయమని మీరు తలంతురా?

ప్రశ్న : 14

మామూలు నిర్వహణ గ్రాంట్లను. పైన చెప్పిన ఇరిగేషను పంచాయతీలకు మళ్లిస్తూ కనీసం వాటికి అట్టి, నీటి వనరుల (10, 20, లేదా 30 ఎకరములలోపు భూమికి నీటిపారుదల చేయు వర్షా ధారపు చెరువుల) నిర్వహణను అప్పగించ వచ్చునని మీరు తలంతురా?

ప్రశ్న : 15

(ఎ) నదులనుండి

(బి) సెలయేరుల నుండి

(సి) కాలువల నుండి నీటిని తోడి సాగు చేయుటకు రైతులకు అనుమతినీయవచ్చునా? అట్లు అనుమతినిచ్చిన సందర్భములో, ఎంత నీటి పన్ను విధించవచ్చును?

ప్రశ్న : 16

కాలువ నుండి ఊట ద్వారా నీటిని పొంద గలుగునంతటి సమీపమున బావులు త్రవ్వుటకు అనుమతినీయవచ్చునా? అనుమతినిచ్చిన యెడల, ఎంత నీటి పన్ను విధించుట యుక్తము?

ప్రశ్న : 17

సాగునీటి ప్రాజెక్టుల క్రింద, యెల్లప్పుడు పంటలు పండని ప్రాంతములలో భావి నీటితో ఎల్లప్పుడు పంటను పండించుటకు అనుమతి నీయవచ్చునా?

అనుమతినిచ్చిన యెడల అదనపు నీటి ఛార్జీని విధించుట యుక్తమా?

ప్రశ్న : 18

నిశ్చయింపబడిన ఆయకట్టును దాటి లేదా నీటి పారుదల ప్రాజెక్టుల క్రింద వచ్చెడి నీటిని అనధికారముగా వినియోగించుటవలన బెడద యేర్పడుచున్నట్లు తెలియుచున్నది.

ఈ బెడదను తొలగించుటకు ఎట్టి చర్యలను తీసుకొనవలెనని మీరు సూచించెదరు?

ఈ క్రింది సూచనలలో ఏది తగినదని మీరు భావించెదరు?

(ఎ) జరిమానాలు విధించుటకు పబ్లికు వర్క్సు శాఖ ఉద్యోగులకు అధికారము నిచ్చుట.

(బి) న్యాయస్థానముల ద్వారా చర్య తీసుకొనుటకు పబ్లిక్ వర్క్సు శాఖలో ప్రత్యేక వుద్యోగులను నియమించుట.

(సి) అట్టి సంఘటనలు నివారించుటకు, వాటిని గురించి తెలియచేయుటకు గ్రామోద్యోగులను, ఆయకట్టుదార్లను, బాధ్యులుగా చేయుట.

మే, 1958

ప్రశ్న : 19

ప్రాజెక్టు క్రింద లేక నిశ్చయించిన పాత ఆయకట్టులలో లోగడ వర్షాధారపు చెరువులు ఉన్నవి.

వాటిని గండిగొట్టి చెరువుల గర్భములను ప్రాజెక్టు నీటితో సాగుచేయుట మంచిదా? లేక ఆ చెరువులను ప్రాజెక్టు నీటితో నింపి చెరువులుగా ఉపయోగించుట మంచిదా?

రెండవ సందర్భంలో శిస్తు ఆయకట్టులో మిగత దాని శిస్తుతో సమానంగా వసూలు చేయాలని సిఫార్సు చేయుదురా? లేక హెచ్చు శిస్తునువసూలు చేయాలంటారా?

ప్రశ్న · 20

మీ భూములు, నదుల ఆనకట్ల క్రింద లేదా ప్రాజెక్టుల క్రింద నిరంతరము నీటిపారుదల అగు ప్రాంతములలో గలవా? లేదా మార్పు (రొటేషను) పద్ధతిపై పారుదల జరుగు ప్రాంతములలో గలవా? అట్లు అయినచో, నీటి సరఫరా జరుగు కాలపరిమితి వివరములను పేర్కొనుడు.

ప్రశ్న : 21

మీ భూములు నీటి పారుదల గల మెట్ట ప్రాంతంలో వుంటే ప్రభుత్వముచే నిర్ణయింపబడు నీటి సరఫరా కాలములను, పంటల మార్పును వివరింపుడు.

మీరు అవలంబించు పంటలమార్పును కూడ వ్రాయుడు.

ప్రశ్న : 22

కర్నూలు-కడప కాలువ, తుంగభద్ర ప్రాజెక్టు వంటి నీటి వనరుల క్రింద మార్పిడి పద్ధతిలో ఆరుతడి పంటలను పండించుచున్న యెడల, మీరు పాటించే పంటల మార్పిడి పద్ధతిని దయచేసి వివరింపుడు. వ్యవసాయ శాఖ వారు సూచించిన విధముగా పంటల మార్పిడిని అనుసరించుటకు చిక్కులేవైనా ఉన్నచో వాటిని తెల్పుడు.

ప్రశ్న : 23

1955, ఆంధ్ర నీటిపారుదల నిర్మాణముల (నిర్బంధపు నీటి తీర్వ విధింపు) చట్టములోని నిబంధనలు, రైతులకి ప్రోత్సాహకరంగా ఉన్నవా?

లేనిచో వున్న నీటిని వివేకంగా వుపయోగించుకొని అధికాహారోత్పత్తిని సాధించుటకై సర్కారు వారు ఎట్టి చర్యలు తీసుకొనవలయును?

ప్రశ్న : 24

ఏదైన ప్రాజెక్టు క్రింద సాగుకాగల భూమిని మాగాణిగా మార్చుటకు దానిపై యెక్కువ ఖర్చు అగునను కారణము చేత ఆ భూమి మాగాణీ సేద్యము క్రిందికి తేబడలేదని తెలియవచ్చినదా?

ఈ సమస్యను పరిష్కరించుటకు మీరు చేయు సూచనలేవి?

ప్రశ్న : 25

పంట కాలువలు లేకపోవుటవలన గాని పంట కాలువలను సకాలములో మరమ్మత్తు చేయకపోవుట వలనగాని ప్రాజెక్టుల క్రింద నీటిపారుదల సదుపాయముల వినియోగమునకు ఏ విధముగానైనను ఆటంకము కలుగుచున్నదా?

ప్రశ్న : 26

పంట కాలువలకు అవసరమగు మరమ్మతు పనులు సకాలములో చేయుటకు పబ్లిక్ వర్క్సు శాఖ వారికి సాధ్యమగునా? లేదా మామూలుగా మరమ్మతులకు యియ్యబడే గ్రాంటులను ఆయకట్టు దారులకే యిచ్చినచో పని ఇంకను త్వరితముగా జరుగగలదా?

మే, 1958

శిబిరంలోని నాయకులు గ్రామస్థుల సహాయంతో ఒక ఫర్లాంగు పొడువున కచ్చారోడ్డు నిర్మించారు. ఇందులో దాదాపు 75 మంది పాల్గొన్నారు.

సముద్ర చేపలు, మంచినీటి చేపల ప్రదర్శనం ఒకటి ఏర్పాటు చేయబడింది.

శిబిర నిర్వహణకైన రు. 194 ఖర్చును వెట్లపాలెం గ్రామస్థులే భరించారు. ఈ జిల్లాలో ఇట్టి కార్యక్రమం జరగడం ఇదే తొలిసారి. ఇక్కడ 7 గ్రామాలకి చెందిన గ్రామనాయకులు మొత్తం 54 మంది శిక్షణ పొందారు.

2 గూడూరు జాతీయ వికాస సేవాకేంద్రం అధ్వర్యాన 1958 మార్చి 6 నుండి 8 వ. తేదీవరకు తరకటూరులో మరొక గ్రామనాయకుల శిక్షణా శిబిరం ఏర్పాటు చేయబడింది. ఈ సందర్భంలో హరిజన సేవక సమాజ్ కన్వీనరు శ్రీ కొడాలి ఆంజనేయులు, శ్రీ ఆర్. అచ్యుతరామయ్య, పెక్కూరు జిల్లా ప్లానింగ ఉద్యోగులు శిక్షణపొందే గ్రామనాయకులను ఉద్దేశించి తమతమరంగాలలో జరుగుతున్న కార్యకలాపాలను గూర్చి మాట్లాడారు. తరకటూరు గ్రూపుక్రింద ఉన్న గ్రామాలనుంచి వచ్చిన గ్రామనాయకులు మొత్తం 50 మంది యీ శిబిరంలో పాల్గొన్నారు. ఈ మూడు రోజులలోను ప్రదర్శనలు, సాంస్కృతిక కార్యకలాపాలు ఏర్పాటు చేయబడినవి.

3 శ్రీకాకుళం జిల్లాలోని బుర్జా జా. వి. సే. కేంద్రం బ్లాకుస్థాయి రెండవ మేలా, గ్రామనాయకుల 6 వ శిక్షణా శిబిరం 1958 ఫిబ్రవరి 11 వ. తేదీనుంచి 13 వ. తేదీవరకూ వెంకటపతిరాజుపేటలో వుచితరీతిని జరుపబడినవి. ఇందుకయిన ఖర్చులో నూటికి నూరుపాళ్ళను గ్రామస్థులు భరించారు. ఇవి 1957-58 లో గ్రామస్థుల పూర్తి ఖర్చుపై జరిగిన మొటమొదటి మేలా,



తిర్మలాయపాలెం సమాజాభివృద్ధి కేంద్రంలో గ్రామ నాయకుల శిక్షణా శిబిరం ప్రారంభం.

ప్రశ్న : 5

మీ భూమిలో మీరు పండించు పచ్చి ఎరువు లేదా పశుగ్రాసపు పంటలు ఏవి? వాటికి నీటి పారుదల చేయబడుచున్నదా? ప్రధాన పంటల ఫలసాయమును ఎక్కువచేయు నిమిత్తము ఈ పంటలను విస్తృత పరచుటకు మీ సలహాలేమి?

ప్రశ్న : 6

మెట్ట పంటలను పండించుటలో మీకేమైనా ప్రత్యేక ఇబ్బందులుకలవా?

ప్రశ్న 7:

మీ మెట్ట భూములలో మీరు అవలంబించు పంటల మార్పిడి (రొటేషను) పద్ధతి ఏది ?

ప్రశ్న 8:

పశువులు, వాటి జీవిత పరిమాణము, అంటువ్యాధులు, పాల సరఫరా మున్నగు విషయములు, మరియు ఎరువు కొరకు పశువుల మందలను పెంచుట :—

(ఎ) మీ ప్రదేశములో చిన్నరకపు, మధ్యరకపు, పెద్దరకపు ఎడ్లజతల ఖరీదులను తెలుపుడు.
షరా: ఒక్క జాతికంటే ఎక్కువ జాతుల ఎడ్లున్నచో ఉదాహరణకు వంగోలు, దేవుణి, హల్లికారు—ఒక్కొక్క జాతికి చెందిన మూడు రకాల జతల ధర యివ్వవచ్చును వ్యవసాయమునకు దున్నపోతుల్ని వాడినచో అదేవిధమైన వివరములనే యివ్వవలెను.

(బి) పోషణ విషయంలో మామూలు జాగ్రత్త తీసుకున్నప్పుడు మీ ప్రాంతలో ఒక జత పశువులు ఎన్ని సంవత్సరములపాటు బాగా పనిచేయగలవు ?

(i) దున్నుట, నూర్చుట మున్నగు సాధారణ వ్యవసాయ పనులకు ఉపయోగించు పశువులు.

(ii) బావులనుండి మోటలు మున్నగు వాటి ద్వారా నీటిని తోడుట వంటి ప్రత్యేకమైన కఠిన శ్రమకు ఉపయోగించు పశువులు.

(సి) జత పశువుల పోషణకు సంవత్సరమునకు అగు ఖర్చు ఎంత ? (ఎండుగడ్డి ధర, దాణా వస్తువుల ధర విడివిడిగా ఇవ్వవలెను).

ప్రశ్న 9:

మీ ప్రాంతములో చీడలు, తెగుళ్ల బాధ ఎక్కువగా ఉన్నదా ? అయినచో పండించబడు ప్రతి పంటకు సంబంధించిన వాటిని తెలుపుడు. ఈ చీడలు, తెగుళ్లు సస్య రక్షణ చర్యలచే నివారింపబడుచున్నవా ?

అయినచో ఆ పద్ధతులను పేర్కొనుడు. ఖర్చులను తెలుపుడు. అట్లు నివారింపబడకున్నచో వాటి వలన ఆయా పైర్లకు వాటిల్లు నష్టమును తెలుపుడు. మరియు వాటినెదుర్కొనుటకు వ్యవసాయదారులకు అవసరమగు సహాయమును సూచించుడు.

ప్రశ్న 10:

మీ ప్రాంతములో పశువులకు తగులు రోగము లేవి ?

(ఎ) అంటు వ్యాధులు.

(బి) సాధారణ రోగములు—వీటి విషయములో సకాలములో తగిన పశువైద్య సహాయము లభించుచున్నదా ?

ప్రశ్న 11:

మీ ప్రాంతములో ఆవులు, గేదెలు ఇచ్చు పాలపరిమాణ మెంత ?
రెండును పాలుతీయుటకు ఉపయోగింపబడుచున్నవా ? ఆవులను గాని, గేదెలనుగాని మాత్రమే పాలు తీయుటకు ఉపయోగించుచున్నారా ? అవి పాలు తక్కువగా ఇచ్చుచున్నచో ఆ లోపము ఈ క్రింది వాటిలో దేనివలన కలుగుచున్నది,—

(ఎ) పశు గ్రాసపు కొరత—పచ్చి లేక ఎండు గడ్డి,

(బి) దాణా వస్తువుల కొరత,

(సి) తక్కువ జాతికి చెందియుండుట,

(డి) తగిన సంరక్షణ లేకపోవుట ?

ప్రశ్న 12:

మీ ప్రాంతమునకు ఇతరచోట్ల నుండి ఏవైన క్రొత్త జాతులు తీసికొని రాబడినవా ? ఐనచో ఆ జాతులేవి ? ఎచ్చటనుండి తీసికొని రాబడినవి ? పాలిచ్చుటలోను, బరువులు లాగుటలోను స్థానిక పశువులతో పోల్చినచో అవి ఎట్లున్నవి ? అవి మేలుగాయున్నచో దానికి కారణము వాటి పోషణ బాగుండుటయా లేక వాటి స్వభావసిద్ధమైన గుణములా ?

ప్రశ్న 13:

మీ ప్రాంతములోని వ్యవసాయ దారులకు ఈ క్రింద వాటి విషయములోగల పరపతి సౌకర్యము లేమి:

(ఎ) మామూలు వ్యవసాయపు ఖర్చులకు

(బి) మేలుకరపు విత్తనములు, రసాయనిక ఎరువులు కొనుటకు,

(సి) ఎడ్లను, పంపుసెట్లను కొనుటకు, బావులు మున్నగు వాటిని నిర్మించుటకు మధ్యకాలిక (అంత స్వల్పకాలము, అంత దీర్ఘకాలముకాని) ఋణములకు,

(డి) భూములు మున్నగువాటిని కొనుటకు దీర్ఘకాలపు ఋణములకు.

ప్రశ్న 14:

పై ప్రతి అంశం విషయంలోను ఈ క్రిందివారి లేక వాటి సహాయమెంతవరకు గలుగుచున్నది:—

(ఎ) బంధువులు, స్నేహితులు,

(బి) స్థితిమంతులైన వ్యవసాయదారులు,

(సి) గ్రామమందలి వడ్డీ వ్యాపారులు, వర్తకులు,

(డి) గ్రామ సహకార సంఘములు,

(ఇ) భూమి తనఖా బ్యాంకులు,

(యఫ్) ప్రభుత్వతక్కావీ ఋణములు.

(జి) వ్యవసాయ శాఖ అప్పులు.

పై తెల్పిన ఆధారములలో వేటినుండి అయినను అప్పును పొందుటలో ఏమైన ఇబ్బందులు కలవా? దయచేసి అప్పు లభ్యమగుటకుగల షరతులను పేర్కొనుడు. పరపతి సౌకర్యమును, అదిలభ్యమగు పద్ధతిని, వృద్ధి పరచుటకుగల మార్గములను సూచింపుడు.

ప్రశ్న 15:

వ్యవసాయదారులు అప్పులను తిరిగి సకాలములో చెల్లించుచున్నారా? లేనిచో ఇందుకుగల కారణము వారి ఉపేక్షయా లేక వ్యవసాయము లాభసాటిగా లేక పోవుటయా? ఈ పరిస్థితిని చక్కదిద్దుటకు మీ సూచన లేవి?

ప్రశ్న 16:

మీ ప్రాంతములో సహకార సంఘములు చక్కగా పనిచేయుచున్నవా? లేనిచో అందుకు కారణమేమి?

ప్రశ్న 17:

పరపతి సౌకర్యములు లేనందువలన పంటల ఉత్పత్తి పెంపుదల ఏ విధముగా నిరోధింప పడుచున్నది కొన్ని సందర్భములను పేర్కొని, అట్టి పరిస్థితిని చక్కదిద్దుటకు మార్గములను సూచింపుడు.

ప్రశ్న 18:

మీ సరుకు క్రయ విక్రయములకు సాధారణ మార్గము లేవి?

(ఎ) వడ్లు లేక ధాన్యము.

(బి) ఇతర ఆహార ధాన్యములు.

(సి) నూనె గింజలు, ప్రత్తి.

(డి) మిరపకాయలు, పసుపు మొదలగునవి.

(ఇ) చెరకు బెల్లము.

(యఫ్) పండ్లు, కూరగాయలు, పాలు గ్రుడ్లు మొదలగునవి (నిలవ వుండనివి).

(జి) ఇతర సరకులు.

ప్రశ్న 19:

మీరు వాటిని గ్రామ వర్తకునికి అమ్మెదరా లేక క్రమబద్ధమైన **(Regulated)** మార్కెట్టులో అమ్మెదరా ? క్రమబద్ధమైన మార్కెటులో అమ్ము చున్నచో అది మీకు ఎంత దూరముననున్నది ? కొనుగోలుదారుడు చెల్లించెడి పూర్తి మొత్తము మీకు ముట్టునా ? లేనిచో అందుండిచేయు మినహా యింపు లేవి ? వీటిని ఎంత వరకు తగ్గించవచ్చును.

ప్రశ్న 20:

మీ ప్రాంతంలో సహకార మార్కెటింగ్ సొసైటీ ఉన్నదా ? అందు మీరు సభ్యులా ? ఐనచో మీరు పొందు లాభములేవి ? కానిచో అందుకుగల కారణములు తెలుపుడు.

ప్రశ్న 21·

మీ ప్రాంతములో వ్యవసాయ దారుల సంఘము కలదా ? అటు వంటిది ఒకటి ఉన్నచో అందు మీరు సభ్యులా ? లేనిచో వ్యవసాయదారు లందరి ఆర్థిక పరిస్థితులను పెంపొందించుటకు మీరొక సంఘమును ఏర్పాటు చేయదలతురా ?

## ఆరవ భాగము

భూమిశిస్తు, ఇతర పన్నుల విధింపు, వాటి వసూలు, **మాఫీ** లేక రెమిషను మంజూరు, వీటికి సంబంధించిన ఇతర విషయములు

ప్రశ్న 1:

ఈ క్రింది విషయములకు సంబంధించి ప్రస్తుత మున్న విధానము మీకు తృప్తికరముగా నున్నదా? లేనిచో దానిని ఏ విధముగా సరిదిద్దవలెనో సూచింపుడు:—

(ఎ) శిస్తును వసూలుచేయు కాలము,

(బి) శిస్తు రశీదుల నమూనా,

(సి) భూమిశిస్తు, ప్రభుత్వము నుండి **గాని** సహకాల సంస్థల సుండి **గాని** పొందిన అప్పుల బకాయిలను వసూలు చేయు తరుణము,

(డి) మెట్ట భూములలో పంటలు మొత్తముగా చెడి పోవుట వలనగాని, మాగాణీ మరియు నీటి పారుదల సౌకర్యములుగల భూములలో ప్రత్యేక కారణములచే పంటలు చెడిపోవుట వలన గాని రెమిషను లేక మాఫీ మంజూరు చేయుట,

(ఇ) రెండవ పంట వరిని (తాబి) పండించు విస్తీర్ణమును నిర్ణయించు పద్ధతి (తెలంగాణా ప్రాంతములో "తయ్‌బంది" అని పిలువ బడును)

(యఫ్) ఆయకట్టులో కొన్ని సంవత్సరములకు పైబడి సాగుచేయబడుచున్న భూమిని మాగాణీగా మార్చు పద్ధతి,

(జి) అజమాయిషి, పై ఆజమాయిషీ లేక రెమిషను, మాఫీ మంజూరు.

(హెచ్) వారసత్వము, విభజన, లేక అమ్మకము వల్ల భూముల పట్టా రిజిస్టరీని మార్చుట లేక బదిలీ చేయుట,

(ఐ) సర్వే సబ్ డివిజను, సరిహద్దు రాళ్ల నిర్వహణ, వ్యవసాయదారులకు పొలము స్కెచ్చీ లేక నక్షాలను పొలముయొక్క వివరములను అందజేయుట,

(జె) జమాబందీలను జరుపుట?

ప్రశ్న : 2

భూమి శిస్తు బకాయీలకుగాను భూములను వేలం వేసిన సందర్భములు ఎక్కువ గలవా?

ప్రశ్న : 3

వేలములో పాటదారులు లేక పోయినందువలన ప్రభుత్వమే భూములను కొనవలసి వచ్చిన సందర్భములు ఎక్కువ గలవా?

ప్రశ్న : 4

ఆహార ధాన్యముల పైనను వ్యాపారపు పంటల పైనను అమ్మకపు పన్ను లేక కొనుగోలు పన్ను విధింపును గురించి మీ అభిప్రాయము లేవి? ఈ పన్నుల భారములో భూఖామందు ఎంత భాగము వహించ వలసి వచ్చుచున్నది?

ప్రశ్న : 5

రైతువారీ పట్టాలోని నిబంధనలేవైన వ్యవసాయదారులకు ఇబ్బందిని కలిగించుచున్నవా? ఐనచో, దానిని తొలగించుటకు మీరు ఏ మార్పులను సూచించెదరు?

ప్రశ్న : 6

తుఫాను లేక గాలివానల వలన పాడై పోయిన మెట్ట, మాగాణీ పంటల విషయములో ఏ రెమిషను (మాఫీ) రేటు యుక్తముగా నుండును.?

ప్రశ్న : 7

కొబ్బరి తోటలు గాలివాన తరువాత రెండు మూడు సంవత్సరముల వరకు మామూలుగా కాయవు. గాలివాన వలన పాడైపోయిన కొబ్బరి

తోటలకు ఏదైన ప్రత్యేక రాయితీ అవసరమని భావింతురా?

ప్రశ్న : 8

విస్తారముగా చీడల వలన ప-టల తెగుళ్ళవలన నష్టపడిన పంటలకు ఏ శ్రేణిలో రెమిషను (మాఫీ) ఇచ్చుట సబబుగా యుండునని మీరు భావింతురు?

ప్రశ్నావళికి సమాధాన మిచ్చు వ్యక్తియొక్క

చిరునామా............ సంతకము............

స్థలము............... హోదా............

తేదీ...............



# ఖమ్మం జిల్లా ఖనిజసంపద

## ప్రభుత్వ భూగర్భ పరిశోధన శాఖ యిటీవల జరిపిన కృషి

ఖమ్మం జిల్లా పాఖాల్ అరణ్య ప్రాంతంలో ఇనుప గనులున్నట్టు 1954 లో కనుగొనబడింది. ముడి యినుం 'పాఖాల్' ఇసుక రాళ్లలో దొరుకుతున్నది. ఈ ప్రాంతంలో ముడి యినుంయెంతవరకూ లభిస్తుందో తెలుసుకొనుటకు ప్రభుత్వ గనులు, భూగర్భ పరిశోధన శాఖ పరిశీలనలు జరిపింది. ముడి యినుం అక్కడక్కడ కొన్నిచోట్ల మాత్రమే దొరుకుతుందనీ, అయితే అది అమ్మకానికి పనికి వస్తుందనీ యింతవరకూ లభించిన ఫలితాలవల్ల తేలింది. ఇంతవరకూ యీ ప్రాంతంలో ముడి యినుం త్రవ్వకానికై అయిదు కౌల్లు యివ్వబడినవి. 1957 ఆఖరి నాటికి మొత్తం 55 వేల టన్నుల ముడి యినుం తీయబడింది.

ఖమ్మం జిల్లా పాల్వంచ తాలూకాలోని యెల్లంబయిలు, మైలారంల సమీపంలో రాగి త్రవ్వకానికై పూర్వం కృషి జరిగింది. హైద్రాబాదు భూగర్భ పరిశోధన శాఖలో పరిశోధనలు జరిపిన ప్రొఫెసర్ సి. మహాదేవన్ కొన్ని సంవత్సరాల క్రిందట యీ విషయాన్ని కనుగొన్నారు.

1950-54 మధ్య మైలారం సమీపంలోని ప్రదేశాన్నిపూర్తిగా పరిశీలించగా ప్రాచీనులు రాగి అధికంగా వున్న మండలాన్ని వుపరితలానికి దగ్గిరగా తోడినట్టు కనబడింది. ఈ త్రవ్వకాల పునః ప్రారంభం వల్ల యింత వరకూ యెక్కడా ఒకే చోట తగినంత ఖనిజం దొరకలేదు.

ఎల్లంబయిలు వద్ద జరిగిన భూభౌతిక పరిశోధనల వల్ల ఖనిజం దొరికే అవకాశాలున్న సూచనలు కనబడ్డాయి. ఆంధ్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయాల సిబ్బంది, విద్యార్థులు కలిసి యీ ప్రాంతంలో పూర్తి పరిశోధనలు జరిపారు. ఎక్కడా తగినంత ఖనిజం లభించక పోయినప్పటికీ ఫలితాలు వుత్సాహ జనకంగానే వున్నాయని భావించబడింది.

ముగ్గురాతికోసం యింత వరకూ కడప, కర్నూలు జిల్లాల్లో పనిచేయబడుతుండేది. ఖమ్మం జిల్లా పాఖాల సున్నం, చలువరాళ్లలో యిది దొరుకుతుందని 1956లో కొత్తగా కనుగొనబడింది. ఆంధ్ర విశ్వ విద్యాలయం విద్యార్థుల సహాయంతో ఆ ప్రాంతం పూర్తిగా పరిశీలించబడింది. అక్కడ యించుమించు 8 లక్షల టన్నుల ముగ్గురాయి లభించవచ్చునని ఆ పరిశీలనవల్ల తేలింది.

### పూర్తిపరిశీలన

ఒకే ఫార్మేషన్‌లో (పాఖాల్స్) యిన్ని ఖనిజాలున్నాయని తెలిసినందున, వాటిని పూర్తిగా పరిశీలించాలని ఆలోచన జరుగుతున్నది. అప్పుడు యీ ప్రాంతంలో ఖనిజాలు గల ప్రాంతాలు మరి కొన్ని బయటపడవచ్చు. పాఖాల్ ఫార్మేషన్ మొత్తం విస్తీర్ణం రమారమి వెయ్యి చదరపు మైళ్లు. ఇది ఖమ్మానికి సమీపంలో వాయవ్య దిశగా రామగుండం వరకూ వ్యాపించి వుంది.

కడప బేసిన్‌లో రసాయనికంగా స్వచ్ఛమైన సున్నపు రాళ్ల నిమిత్తం పూర్తి పరిశీలనలు జరపాలని ప్రభుత్వ భూగర్భ పరిశోధన శాఖ ఆలోచిస్తున్నది. ఈ సున్నపు రాళ్లు బ్లీచింగ్ పౌడరు, పారిశ్రామిక ప్రయోజనాలకి పనికి వచ్చే వుత్తమశ్రేణి సున్నాల తయారీకి వినియోగిస్తాయి.

ఖమ్మం జిల్లా కొన్ని ప్రాంతలలోను, తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల యేజన్సీ ప్రాంతాలలోను గ్రాఫైటు నిమిత్తం పరిశీలనలు జరిపే విషయం ఆలోచనలో వుంది. క్రోమైటు, ముడి యినుం, ముడి మాంగనీసుల నిమిత్తం పూర్తి పరిశీలనలు జరిపే ప్రతిపాదనలు కూడా ప్రభుత్వ పరిశీలనలో వున్నాయి.

తూర్పు గోదావరి జిల్లాలో గోదావరి కేంద్ర డెల్టాలో ప్రకృతి సిద్ధంగా లభించే వాయువు (గాస్) ను స్థానిక పరిశ్రమలలో వుపయోగించే ప్రతిపాదనల అమలుకై పథకాలు తయారుచేయబడుతున్నాయి.

# ప్రకటన

తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ భాషలలో వెలువడే "ఆంధ్రప్రదేశ్" పత్రిక సంవత్సర చందా రేటు 1958 జూన్ నెలనుంచి రూ. 2.16 న. పై. గా నిర్ణయించబడింది. విడిప్రతి వెల రూ. 0.18 న పై.

# ప్రశ్నోత్తరావళి

20వ. ప్రశ్న: (శ్రీ ఎమ్ ఎస్ రామచంద్రరావు, పశ్చిమగోదావరి జిల్లా). ఆంధ్రప్రదేశ్ స్వయం సమృద్ధమైన రాష్ట్ర మేనా ?

జవాబు: ఆహారోత్పత్తి విషయంలో ఆంధ్ర ప్రదేశ్ స్వయంసమృద్ధిని మించిపోయింది. వస్త్రోత్పత్తి విషయంలో మాత్రం అది అలాలేదు. బొగ్గు కూడా దానికి కావలసిన దానికంటె యెక్కువే లభిస్తుంది. ఖనిజాలు, పరిశ్రమలకవసరమైన వివిధ ముడివస్తువుల విషయంలో స్వయం సమృద్ధిని సాధించుటకు అది బాగా కృషిచేయవలసివుంది.

21వ. ప్రశ్న: తాజా అంచనాల ప్రకారం ఆంధ్రప్రదేశ్‌లో తలసరి ఆదాయం యెంత ?

జవాబు: 1955-56 తాత్కాలిక అంచనాల ప్రకారం రూ. 249/-

22వ. ప్రశ్న: ఆంధ్రప్రదేశ్‌లో రసాయన యెరువుల ఫ్యాక్టరీలెన్నివున్నాయి ?

జవాబు: హైదరాబాదు కెమికల్సు అండ్ ఫెర్టిలైజర్సు లిమిటెడ్ చే నిర్వహింపబడే ఫ్యాక్టరీ ఒకటి తెలంగాణాలోని బెల్లంపల్లిలోవుంది. కాని భారీయెత్తున రసాయన యెరువులను తయారుచేసే ఫ్యాక్టరీ యింకా ఆంధ్ర ప్రదేశ్ లో నెలకొల్పబడలేదు.

23వ. ప్రశ్న: (శ్రీ టి. చెంచురామయ్య, వాత్తెరు) మన రాష్ట్రంలో నిరుద్యోగ సమస్య పరిష్కారానికి చిన్నరకం పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు యెంత వరకు తోడ్పడగలవు ?

జవాబు: మన రాష్ట్రి చేనేత పరిశ్రమ 16.15 లక్షల మందికి పనికల్పిస్తుంది. ఇతర చిన్నరకం పరిశ్రమలు, కుటీర పరిశ్రమలు మరి కొన్ని లక్షుల మందికి పనికల్పిస్తాయి. ప్రస్తుతం యీ పరిశ్రమల అభివృద్ధికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సహాయం చేస్తున్నందున అవి క్రమేణా యింకా యెక్కువ మందికి పనికల్పించవచ్చు. ఆమేరకి నిరుద్యోగ సమస్య పరిష్కారం కాగలదు. మన రాష్ట్ర జనాభా 313 లక్షలు. ఈ సమస్యను మన జనాభా దృష్ట్యా పరిశీలించాలి.

24వ. ప్రశ్న: ఆంధ్రలో యేమేమి తూల, భారీ, పరిశ్రమల స్థాపన సంకల్పించబడింది? అవి ప్రైవేటు పారిశ్రామికుల ప్రయత్నానికి వదలబడ్డాయా ?

జవాబు: రాష్ట్రంలో రసాయన యెరువుల ఫ్యాక్టరీ స్థాపనకై చేసే ప్రయత్నం యింకా ఫలించలేదు. ఈ సంస్థ ప్రభుత్వనిర్వహణ క్రిందే వుండగలదని తలచబడుతున్నది. సిర్పూరులో 'బెగ్గసీ'తో న్యూస్ ప్రింటును తయారుచేసే మిల్లు ఒకటి నెలకొల్పబడుతున్నది. ఇందులో ప్రైవేటు పారి

శ్రామికుల కృషి ప్రమేయమున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో ప్రభుత్వ యాజమాన్యం క్రింద ఆరు సహకార పంచదార ఫ్యాక్టరీలను నెలకొల్పవలసి వున్నది.

25వ. ప్రశ్న: ముందు ముందు మన రాష్ట్రంలో ప్రైవేటు పారిశ్రామికులు అభివృద్ధి చెందే అవకాశమున్నదా?

జవాబు: మన రాష్ట్రంలో ఖనిజ సంపద, వివిధ పరిశ్రమల కవసరమైన ముడి పదార్థాలు పుష్కలంగా వున్నాయి. కాబట్టి ప్రైవేటు పారిశ్రామికులు రాణించడానికి బోలెడు అవకాశము న్నది. అయితే అందుకు వారు ఆయా పరిశ్రమలకి సంబంధించిన విషయాల్ని క్షుణ్ణంగా తెలుసుకొని, చక్కని శిక్షణనుపొంది వుండాలి.

26వ. ప్రశ్న: రాష్ట్రప్రభుత్వం పరిశ్రమలకి యేవిధంగా పెట్టుబడి పెడుతున్నది?

జవాబు: కొన్ని భారీ పరిశ్రమలలో రాష్ట్ర ప్రభుత్వానికి అత్యధిక భాగం వాటాలుంటాయి. మరి కొన్నిటికి పాత పారిశ్రామిక ధర్మనిధి సిస్టం క్రింద అది అప్పులు యిచ్చివుంటుంది. ఇప్పుడు అట్టి అప్పుల్ని రాష్ట్ర పారిశ్రామిక ఆర్థిక సహాయ సంస్థ యిస్తున్నది.

27వ. ప్రశ్న: (శ్రీ పి. ఏ. రషీద్‌ఖాన్, హిందూపురం)

ఆంధ్రప్రదేశ్‌లో యిప్పుడు యెన్ని పంచదార ఫ్యాక్టరీలు పని చేస్తున్నాయి.

జవాబు: ఇప్పటికి పనిచేస్తున్నవి 10. మరి అయిదింటికి లైసెన్సులు యివ్వబడ్డాయి. బోధన్‌లో ఒక సహకార పంచదార ఫ్యాక్టరీని నెలకొల్పవలసి వుంది.

28వ. ప్రశ్న: (శ్రీ పి. ప్రసాద్, న్యూ బోయిగూడా, సికిందరాబాదు)

నయాపైసలవల్ల ప్రజలకి లాభమా లేక ప్రభుత్వానికి లాభమా?

జవాబు: క్రొత్త నాణెములు మొదట భారతదేశంలో కనిపెట్టబడిన సరళమైన దశాంశ పద్ధతిపై ఆధారపడివున్నందున వాటిని చదువుకోని వారు కూడా సులభంగా లెక్కించుకోగలరని అవి ప్రవేశ పెట్టబడ్డాయి. కాబట్టి అవి లాభించేది ప్రజలకే.

29వ. ప్రశ్న: (శ్రీ జి. లింగయ్యా, మెదక్)

హైదరాబాదు టంకశాల యేమి చేస్తున్నది?

జవాబు: నయాపైసా నాణెముల తయారీలో తోడ్పడుతున్నది.

30వ. ప్రశ్న: ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో యెందరు మంత్రులున్నారు.

జవాబు: 13 మంది.

31వ. ప్రశ్న: ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధాల శాఖ యెప్పుడు యేర్పడింది?

జవాబు: 1956 నవంబరు 1వ తేదీన. అదే పేరుతో పూర్వ హైదరాబాదు ప్రభుత్వం క్రిందవున్న శాఖ, పూర్వాంధ్ర ప్రభుత్వ హోం శాఖ లోని సమాచార, ప్రచార శాఖల విలీనంతో యిది యేర్పడింది.

# అభివృద్ధి కార్యక్రమ కేంద్రాల విశేషాలు

## గ్రామనాయకుల శిక్షణా శిబిరాలు

కోటబొమ్మాళి జాతీయ వికాస సేవా కేంద్రం లోని తిలారులో 1958 మార్చి 28 నుంచి 30 వరకూ గ్రామనాయకుల - నాలుగవ శిక్షణా శిబిరం యేర్పాటు చేయబడింది. చుట్టుపట్ల నున్న 14 గ్రామాల నుంచి 49 మంది గ్రామ నాయకులు వచ్చారు. జిల్లా వ్యవసాయాధికారి, జిల్లాపశువైద్యాధికారి, జిల్లాప్లానింగు ఆఫీసరు, జిల్లా పబ్లిసిటీ అసిస్టెంట్లు యీ శిబిరానికి హాజరయారు. వ్యవసాయం, పశుపోషణ, పంచవర్ష ప్రణాళికల్ని గురించి శిక్షితులకు వివరించ బడింది.

వివిధ ఆధునిక వ్యవసాయపరికరాలతో పని చేయటం, యెరువు, పెంట యెరువు గుంటల్ని త్రవ్వటం, బ్లాకు సిబ్బంది ప్రత్యక్షంగా చేసి చూపించింది. పెద్ద రకం సహకార సంఘం, గ్రామీణ బ్యాంకిలవల్ల కలిగే లాభాల్ని గురించి సహకార విస్తరణాధికారి వివరించారు. శిబిరం జరిగిన ఈ మూడు రోజులలోను గ్రామనాయకులు' గ్రామంలోని వుపాధ్యాయులు, బాల బాలికలు, బ్లాకుసిబ్బంది కలిసి హృదయ పూర్వకంగా పనిచేసి గ్రామం యీ కొసనుంచి ఆ కొసకి గల $1\frac{1}{2}$ ఫర్లాంగుల మట్టిరోడ్డు నిర్మాణాన్ని పూర్తి చేశారు.

మొదటిరోజున స్థానిక నాటక సంఘం హరిశ్చంద్ర నాటకం ప్రదర్శించింది. రెండవ రోజున చేనేత, పంచాయతీ సభలు, స్వల్ప మొత్తాల పొదుపు వుద్యమాలపై వార్తాచిత్రప్రదర్శన యేర్పాటు చేయబడింది. చుట్టుపట్ల గ్రామాలప్రజలుచాల మంది వాటిని చూశారు. మూడవరోజున స్థానిక బుర్రకథ బృందం వారు బుర్రకథ చెప్పారు. ఒక గ్రామస్థాయి కార్యకర్త హరికథ చెప్పారు.

ఈ శిబిర నిర్వహణకి డబ్బు బ్లాకునిధి నుంచి ఖర్చు పెట్ట బడలేదు. ఇందుకైన మొత్తం ఖర్చు రూ 380/-ఆలూరు పంచాయతీ బోర్డు అధ్యక్షుడు శ్రీ. టి. కామి నాయుడు భరించడం జరిగింది.




పాఠశాలా భవనం

### బలుసుపాడు

అమరావతి జాతీయ వికాస సేవా కేంద్రం అధ్వర్యాన బలుసు పాడులో 1958 ఏప్రెల్ 18 నుంచి 20 వరకూ గ్రామ సహాయక సేన శిక్షణా శిబిరం జరిగింది. సత్తెనపల్లి వ్యవసాయ డిమానుస్ట్రేటరు, బ్లాకు సిబ్బంది అభ్యుదయ కరమైన వివిధ వ్యవసాయ కార్యక్రమాల్ని గురించి వివరించారు. ఈ సందర్భంలో

ప్రదర్శనలు కూడ జరుప బడ్డాయి. మొదటి రోజున శ్రీ. ఎస్ రామభద్రరాజువిలువిద్యను ప్రదర్శించారు. మిగిలిన రోజులలో బలుసుపాడు యువజన సంఘం వారు నాటక ప్రదర్శన లిచ్చారు

## కకర్వాయ్

తిర్మలాయ పాలెం సమాజాభివృద్ధి కేంద్రంలోని కకర్వాయ్ గ్రామంలో 1958 మార్చి 23 నుంచి 25 వరకూ గ్రామనాయకుల శిక్షణాశిబిరం యేర్పాటు చేయబడింది. ఇందులో 48 మందికి శిక్షణఇవ్వబడింది. శిబిర నిర్వహణకై గ్రామీణులు రూ 10యిచ్చారు. గ్రామీణులు తమసమస్య లనెదుర్కొనే విధానాన్ని చర్చించుటకు గ్రూపు చర్చలు యేర్పాటు చేయ బడ్డాయి. శిబిర నిర్వహణ కాలంలో రోజూశ్రమ దానం ఆటలు, ఆటల పోటీలు జరుప బడ్డాయి.

●

## చేగూరు

హైదరాబాదు జిల్లా చేవెళ్ల జా. వి. సే. కేంద్రం లోని చేగూరులో 1958 మార్చి 24 నుంచి 26 వరకూ గ్రామ నాయకుల ప్రత్యేక శిక్షణా శిబిరం నిర్వహించబడింది. ఉత్తమ విత్తనాలు, రసాయన యెరువులు, క్రిమిహారులు, ఆధునిక వ్యవసాయ పరికరాలు, స్ప్రేయర్లు మున్నగు వాటితో కూడిన ప్రదర్శనం ఒకటి యేర్పాటు చేయబడింది.

ఈ శిబిరంలో శిక్షణ పొందుటకు చేగూరు మండల గ్రామాల నుంచి 50 మంది వచ్చారు. విస్తరణాధికారి (వ్యవ.) శ్రీ పి. కె. నైగాం ఆఖరి రోజున మాట్లాడుతూ ప్రతి విషయంలోను ఆధునిక పద్ధతుల్ని అవలంబించమనీ, బ్లాకు సిబ్బంది నుంచి పూర్తిగా సాంకేతిక సలహా సహాయాల్ని పొందమని గ్రామ నాయకుల్ని కోరారు. స్థానిక గ్రామనాయకుడు శ్రీ సాధులు యీ శిబిరం అధ్యక్షుడు. ఈ శిబిర నిర్వహణకై ప్రజలు రూ 50/- యిచ్చారు.

## కలికిరి మేలా

కలికిరి అనంతర తీవ్ర అభివృద్ధి కేంద్రం అధ్వర్యాన 1958 మార్చి 23 నుంచి 25 వరకూ మూడు రోజులు మేలా, ప్రదర్శన జరుపబడినవి.

వ్యవసాయ వస్తువులు, చిత్ర పటాలు, చేతి పరిశ్రమల వస్తువులు ప్రదర్శింపబడ్డాయి.

గ్రామీణులకి, బడి పిల్లలకి కూడా ఆటలు, నాటకాల లో పోటీలు జరుప బడ్డాయి. ఇందులో గెలిచిన వారికి, ప్రదర్శనలోని ఉత్తమ వస్తువులు, స్టాలులకి కూడాబహుమతులు యివ్వబడ్డాయి. బహుమతుల్ని తయ ఆరోగ్య సదనానికి చెందిన డా. బెంజమిన్ పంచిపెట్టారు.

## పాఠశాలా భవనం

గారసమాజాభివృద్ధి కేంద్రం కరజాడ గ్రామంలో స్థానిక ప్రజలు బ్లాకు, జిల్లా బోర్డుల ధన సహాయంతో నిర్మించిన బోర్డు యెలిమెంటరీ పాఠశాల భవనానికి రాష్ట్రనీటి పారుదల, విద్యుచ్ఛక్తి శాఖామాత్యులు శ్రీ జె. వి. నర్సింగరావు 16-4-58 వుదయం ప్రారంభోత్సవం జరిపారు. నీటి పారుదల చీఫ్ ఇంజనీరు శ్రీ ఎల్. వెంకటకృష్ణ అయ్యరు, ధవళేశ్వరం సూపరింటెండింగు ఇంజనీరు, జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు (శ్రీ కె. సీతారామస్వామి) మున్నగువారు యీ వుత్సవానికి హాజరయారు. ఈ సందర్భంలో యేర్పాటైన బహిరంగసభకి శాసన సభ్యుడు శ్రీ పి. ఎస్. నారాయణ అధ్యక్షత వహించారు. ప్రజా బాహుళ్యానికి విద్యార్జనావసరం, సంఘులో పాఠశాలలస్థానాల్ని గురించి మంత్రిగారు మాట్లాడారు. తల్లిదండ్రులు పిల్లల్ని బడికి పంపాలని వుద్బోధించారు.

కరజాడ గ్రామం స్వయంగా పాఠశాలను నిర్మించుకుని, ఆ అభివృద్ధి కేంద్రంలోని యితర గ్రామాలకి మార్గ దర్శకమైంది. 1956 డిసెంబరులో జిల్లా ప్లానింగు ఆఫీసరు ఆవూరు వెళ్లినప్పుడు గ్రామస్థులు అక్కడి పాఠశాలలోని వుపాధ్యాయుడు శ్రీ ఎల్.

జగ్గారావు నాయకత్వాన పాఠశాలా భవనాన్ని నిర్మించుటకు తీర్మానించారు. అప్పటికి పాఠశాల ఒక పూరింటిలో వుండేది. కరజాడ గ్రామం జనాభా 1,200. చదువీడు పిల్లలు 100 మందిని మించి వున్నారు. గ్రామీణులు ఒక కమిటీని యేర్పాటు చేశారు. దానిలో శ్రీయుతులు గుండా అసిరప్ప, గోండు అప్పన్న, బలగా జోగినాయుడు, గోండు లచ్చన్న, పి. వరాహనరసింహం గారలు వున్నారు. వీరిలో శ్రీ గోండు అప్పన్న, జి. ఎన్. టి. రోడ్డుకి ప్రక్కనున్న ఒక మెరక స్థలాన్ని పాఠశాలా భవనం నిర్మాణానికై యిచ్చారు. అది రూ 1,000 విలువ చేస్తుంది. వెంటనే బ్లాకు సిబ్బంది అంచనాల్ని తయారు చేసింది భవన నిర్మాణం పని 1957 జూలైలో ఆరంభమయింది. మొత్తం దీనికయిన ఖర్చు రూ 8,800/- లో రూ 3,000/- లను అభివృద్ధి కేంద్రం మంజూరు చేసింది. మిగిలిన ఖర్చును ప్రజలు, జిల్లా బోర్డు కలిసి పెట్టుకున్నారు. శ్రీ గోండు అసిరప్ప నాయకత్వాన గ్రామీణులు, వుపాధ్యాయుడు శ్రీ ఎల్. జగ్గారావు నాయకత్వాన బడి పిల్లలు యేక మనిషిలా పనిచేస్తూ, పాఠశాలా భవనం నిర్మాణానికవసరమైన శ్రమదానాన్ని చేసి, వస్తు సామగ్రిని సరఫరా చేశారు.

అభివృద్ధి కేంద్రం పాఠశాలలోని గ్రంథాలయానికి పుస్తకాలు మున్నగు వాటిని 50% కంట్రిబ్యూషన్ ప్రాతిపదికపై సరఫరాచేసింది. ఈ గ్రామంలో ఒక నాటక సంఘం వుంది. గ్రామీణులు యీ పాఠశాలా భవనాన్ని తమ వినోద కార్యక్రమాల కేంద్రంగా భావించి ఆనందిస్తారు.



# వ్యవసాయం అభివృద్ధి చెందాలంటే

## సమగ్రమైన పరిశోధన అత్యవసరం

### ప్రభుత్వ వ్యవసాయ శాఖ కృషివివరణ

వ్యవసాయం లో యేరకమైన అభివృద్ధి అయినా పూర్తిగా వ్యవసాయ పరిశోధనపై ఆధారపడి వుంటుంది ఏదేశంలోనైనా వ్యవసాయం అభివృద్ధి చెందాలంటే నూతన భావాలు, నూతన పద్ధతులు, నూతన వస్తువులు నిరంతర ప్రవాహంగా లభించాలి. సమాన సామర్థ్యం గల పరిశోధనా వ్యవస్థలేనిదే యెంత సమర్థమైన విస్తరణ వ్యవస్థ అయినా పురోగమించలేదు. పరిశోధనా రంగంలో కనుగొనబడిన నూతన విషయాల మేరకే విస్తరణ రంగంలో పని జరుగుతుంది. కాబట్టి పరిశోధనా వ్యవస్థకి విస్తరణ వ్యవస్థతో సమానమైన ప్రాధాన్యమున్నది. అది వ్యవసాయ శాఖ ముఖ్యాంగాలలో ఒకటి.

### వ్యవస్థా స్వరూపం

బాపట్ల వ్యవసాయ కళాశాలలోను, హైదరాబాదు రాజేంద్రనగర్ లోని ప్రధాన క్షేత్రంలోను రాష్ట్రం 20 జిల్లాల్లో వ్యాపించివున్న వివిధ వ్యవసాయ పరిశోధన కేంద్రాలలోను అన్ని పంటలు, నేలలకి సంబంధించిన మూల విషయాల పరిశోధన, వ్యావహారిక విషయాల పరిశోధన కూడా జరుపబడతాయి. వివిధ విభాగాలుగావి భజితమైన వ్యవసాయ శాఖ పరిశోధన కార్యక్రమం వివిధ కేంద్రాలలో ఆయాపంటల నిపుణుల అధ్వర్యాన జరుగుతుంది. ఈ విషయంలో వారికి సహాయ పరిశోధనాధికార్లు తోడ్పడుతారు. మన రాష్ట్రంలో మొత్తం 11 మంది పంటల నిపుణులున్నారు వివరాలు యివి:—

1. మెట్టధాన్యాల నిపుణుడు. 2. వరి నిపుణుడు. 3. నూనె గింజల నిపుణుడు. 4. ప్రత్తి నిపుణుడు. 5 కాయ ధాన్యాల నిపుణుడు. 6. చెఱకు నిపుణుడు. 7. ఫలప్రవీణుడు. 8. తోటపని నిపుణుడు. 9 కీటక శాస్త్రజ్ఞుడు. 10. మైకాలజిస్టు. 11. వ్యవసాయ రాసాయనిక వేత్త.

### పరిశోధన కేంద్రాలు.

వ్యవసాయాభివృద్ధిలో పరిశోధన పాత్రను గుర్తించి తొలి పంచవర్షప్రణాళిక కాలంలో దానికి తగినంత ప్రాధాన్యత యివ్వడం జరిగింది. రాష్ట్రంలో ప్రస్తుతం 34 వ్యవసాయ పరిశోధన కేంద్రాలున్నాయి. ప్రతి కేంద్రంలోను జరిగిన పని వివరాలు యివి :-

| కేంద్రం పేరు | పరిశోధన జరిగే పంటలు | కొత్తగా సాధించిన పంటల రకాలు (స్ట్రైన్లు) |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 1. రాజోలు వ్యవసాయ ప్రదర్శన-పరిశోధన కేంద్రం | వరి, మెట్ట ధాన్యాలు. | వరి మున్నగు వాటిలో తగిన రకాల సాధనకై 1955 డిసెంబరులో ఒక సాధారణ ప్రయోజన క్షేత్రం ప్రారంభింపబడింది. భూమి సంపాదన పూర్తయింది. నివాస గృహాలు మున్నగునవి నిర్మాణంలో వున్నాయి. |

| కేంద్రం పేరు | పరిశోధన జరిగే పంటలు | కొత్తగా సాధించిన పంటల రకాలు (స్ట్రైన్లు) |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 2. అరకులోయ క్షేత్రం (అరకు) | వరి, మెట్ట ధాన్యాలు, పళ్లు, కూరగాయలు. | గిరిజనులకి విత్తనాలు, పళ్ల మొక్కలు పంపిణీచేయబడుతున్నాయి. |
| 3. విజయనగరం ప్రభుత్వమెట్ట ధాన్యాల క్షేత్రం. | జొన్న, రాగి, సజ్జ, నువ్వులు. | 'జొన్న' నెం: 138 (పచ్చ జొన్న) రాగి: పునాస- ఎ. ఆర్. 256-1-2 'పైరు'-ఎస్. ఆర్. 124. |
| 4. అనకాపల్లి చెఱకు పరిశోధన కేంద్రం. | చెఱకు, వరి, రాగి, పళ్లు. | సిఓ. 527-ముందుగా మర పట్టే చెఱకు. సిఓ 349-మధ్యకాలంలో మరపట్టుటకు. సిఓ. 419-ఆలస్యంగా మరపట్టుటకు. వరి ఎకెపి. 1-12, రాగి ఎకెపి. 1-6. పళ్ల మొక్కల అంట్లు మున్నగునవి పంపిణీ చేయబడుతున్నాయి. |
| 5. రంపచోడవరం పరిశోధన-ప్రదర్శన క్షేత్రం | ఏజన్సీప్రాంతాలకి అనువైన పళ్ల మొక్కలు. | ఏజన్సీ ప్రాంతాలలో షెడ్యూల్డుజాతుల సంక్షేమ పథకం క్రింద 1955 మార్చిలో ప్రారంభింప బడింది. పళ్ల అభివృద్ధి విషయంలో పని జరుగుతున్నది. |
| 6. పెద్దాపురం ప్రభుత్వ మెట్ట ధాన్యాల క్షేత్రం. | మెట్టధాన్యాలు, మెట్ట వరి, కాయధాన్యాలు | మెట్ట, కాయధాన్యాల విషయంలో పని జరుగుతున్నది. |
| 7. సామర్లకోట వ్యవసాయ పరిశోధన కేంద్రం | వరి | ఎస్. ఎల్. ఓ. స్ట్రైన్లు 1-19. |
| 8. పూళ్లలోతునీటి బియ్యం పరిశోధన కేంద్రం | వరి | డిఎల్ఏ-1 (కల్చర్ 5059) |
| 9 అంబాజీపేట కొబ్బరి పరిశోధన కేంద్రం | కొబ్బరికాయలు | 1955-56లో ప్రారంభమయింది. పని జరుగుతున్నది. |
| 10. మచిలీపట్నం బియ్యం పరిశోధన కేంద్రం | వరి | చవిటి భూముల్లో పెరిగేరకాల సాధనకై 1954-55లో ప్రారంభించబడింది. పరిశోధన జరుగుతున్నది. |

| కేంద్రం పేరు | పరిశోధన జరిగే పంటలు | కొత్తగా సాధించిన పంటల రకాలు (స్ట్రైన్లు) |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 11. లాం (గుంటూరు) వ్యవసాయ పరిశోధన కేంద్రం | జొన్న, మిర్చి, ప్రత్తి, సెనగలు, ధనియాలు | జొన్న జి. 1-4. కొర్ర జి. i. మిర్చి జి. 1, జి. 2. ధనియాలు జి. 14. సెనగలు నెం. 482. |
| 12. పెద్ద పాలెం పసుపు పరిశోధన కేంద్రం | పసుపు | 1955లో ఆరంభమయింది. పరిశోధన పని జరుగుతున్నది. |
| 13. నరసారావు పేట ప్రత్తి సబ్-స్టేషన్ | ప్రత్తి | మిశ్రమ పంట కనువైన తెల్లపింజ ప్రత్తి రకాల సాధనకి. |
| 14. బాపట్ల కళాశాలా క్షేత్రం | వరి, రాగి, చెఱకు, అరటి, కాయధాన్యాలు, పళ్లు, కూరగాయలు. | కళాశాలా విద్యార్థుల శిక్షణ నిమిత్తం. |
| 15. ఒంగోలు ప్రభుత్వ మెట్టధాన్యాల క్షేత్రం | 'పైరు' జొన్న, వరిగలు | 'పైరు' జొన్న, వరిగ, సజ్జ, కొర్రల పైపని జరుగుతున్నది. |
| 16 ఎమ్మిగనూరు ప్రదర్శన-కేంద్రం | వరి, జొన్న, ప్రత్తి, మిర్చి, వుల్లి వగైరా | నీటిపారుదల క్రింద జరిగేసాగు ప్రయోజనాలను ప్రదర్శించుటకై 1955 జూన్‌లో ప్రారంభించ బడింది. పరిశోధన పని జరుగుతున్నది. |
| 17. కదిరి జోనల్ న్యూక్లియస్ విత్తనాల క్షేత్రం | నూనె గింజలు | వేరుసెనగ, ఆముదం విత్తనాల వుత్పత్తి |
| 18. నంద్యాల వ్యవసాయ పరిశోధన కేంద్రం | జొన్న, కొర్ర, ప్రత్తి. | జొన్న-ఎన్. 1- ఎన్ 12. కొర్ర-ఎన్ 1. ప్రత్తి-ఎన్ 14. |
| 19. గిద్దలూరు మోడల్ ఆర్చర్డు-నారు పెంపక కేంద్రం | మామిడి, నిమ్మజాతి, సపోటా, జామి, జీడి మామిడి, ద్రాక్ష | ప్రసిద్ధ జాతుల్ని పెంపొందించి రైతులకి సరఫరాచేయుటకై 1953-54లో ప్రారంభించ బడింది, |
| 20. బుచ్చిరెడ్డి పాలెం బి య్యం పరిశోధన కేంద్రం | వరి | బిసిపి 1- బిసిపి 5. |

| కేంద్రం పేరు | పరిశోధన జరిగే పంటలు | కొత్తగా సాధించిన పంటల రకాలు (స్ట్రైన్లు) |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 21. అనంతపురం ప్రాంతీయ నూనెగింజల పరిశోధన కేంద్రం | ఆముదం, వేరుసెనగ, నువ్వులు, కుసుమ పంటలలో వర్షాధారంతో పెరిగే రకాల సాధనకై | 1954-55లో ప్రారంభింపబడింది. |
| 22. కోడూరు ఫల పరిశోధన కేంద్రం | మామిడి, నిమ్మ జాతి, సపోటా, జామి, జీడిమామిడి, పనస, దానిమ్మ వగైరా | వివిధరకాల పళ్లమొక్కలు పంపిణీ చేయబడినవి. అంతే కాక మామిడిలో అభివృద్ధికి రాగల 24 మిశ్రమ జాతిరకాలు సాధించబడినవి. |
| 23. కాళహస్తి పానగల్ ప్రదర్శన. | వరి, వేరుసెనగ, అరటి, కూరగాయలు. | ప్రదర్శన క్షేత్రం |
| 24. కోసిగి జోనల్ న్యూక్లియస్ విత్తనాల క్షేత్రం | నూనెగింజలు. | వేరుసెనగ, ఆముదాలలో మేలురకం విత్తనాల వుత్పత్తి |
| 25. ముథోల్ (ఆదిలాబాదు) వ్యవసాయ పరిశోధనకేంద్రం | ప్రత్తి | జి. 6, జి-12 |
| 26. రుద్రూరు (నిజామాబాదు) వ్యవసాయ పరిశోధన కేంద్ర | భూమి, తోట సమస్యలు. వరి, చెఱకు పంటల అభివృద్ధి | ఆర్ డి ఆర్ 2 ఆర్ డి ఆర్ 4, వరిలో ఆర్ డి ఆర్ 7 'స్ట్రైన్'లు |
| 27. సంగారెడ్డి (మెదక్) వ్యవసాయ పరిశోధన కేంద్రం | ఫల వృక్షాల అభివృద్ధి 1. సీతాఫలాలు, 2. సపోటా, 3. మామిడి, 4. జామి. 5. దానిమ్మ. పంటల అభివృద్ధి 1. బియ్యం, 2, జొన్న, 3. నూనెగింజలు, కాయగూరలు. | సి 11, సి 28, సి 36 |
| 28 కరీంనగరం విత్తనాల వుత్పత్తి కేంద్రం | మొక్క జొన్న | — |

| కేంద్రం పేరు | పరిశోధన జరిగే పంటలు | కొత్తగా సాధించిన పంటల రకాలు (స్ట్రైన్లు) |
|---|---|---|
| 1 | 2 | 3 |
| 29. రాజేంద్రనగర్ (హైదరాబాదు) వ్యవసాయ పరిశోధన కేంద్రం | భూమి, అందుకు సంబంధించిన సమస్యలు, తోట సమస్యలు, కీటకాలు, చీడలు, మొక్కల వ్యాధులు, పంటల అభివృద్ధి, బియ్యం, కాయధాన్యాలు, మూవెగింజలు, మెట్టధాన్యాలు, పశుగ్రాసం. | ఎన్. ఎమ్. 1. హెచ్. ఎమ్. 2. మొక్క జొన్న హెచ్. సి. 1. హెచ్. సి. 6 ఆముదాలు |
| 30. దిండి (నల్గొండ) వ్యవసాయ పరిశోధన కేంద్రం | పంటల అభివృద్ధి, బియ్యం, ఆముదాలు | — |
| 31. వరంగల్లు వ్యవసాయ పరిశోధన కేంద్రం | తోట సమస్యలు, పంటల అభివృద్ధి, బియ్యం, కాయధాన్యాలు. | — |
| 32. మధిర (ఖమ్మం) వ్యవసాయ పరిశోధన కేంద్ర | పొగాకు | — |
| 33. అంబర్ పేట మొక్కజొన్న పరిశోధన కేంద్రం | మొక్కజొన్న | — |

ఒక కోటి రూపాయల ఖర్చుపై అయిదు సంవత్సరాల పాటు అమలు జరిగే పెక్కు పథకాల ప్రతిపాదనలు మంజూరుకై పంపబడ్డాయి. వీటిలో చాలభాగం ప్రభుత్వ పరిశీలనలో వున్నాయి. అవి ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో మంజూరు కాగలవని భావించబడుతున్నది.

ఈ పథకాలలో పెక్కింటికి భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం, వివిధ వస్తు సంఘాలు పెట్టుబడి పెడతాయి.

రాష్ట్రంలో ప్రధానమైన కొన్ని పంటల విషయంలో జరిగిన పరిశోధనల ఫలితాలు మున్నగు వివరాలు దిగువ యివ్వబడినవి :

1. వరి : మనరాష్ట్రంలో 71,04 లక్షల యెకరాల్లో 33,04 లక్షల టన్నుల వరిధాన్యం పండుతాయి. ఇవి ఇండియా మొత్తం వుత్పత్తిలో దాదాపు 9.5%. ఈ పంటక్రిందగల అత్యధిక భాగం కోస్తాడెల్టా జిల్లాల్లోవుంది. ఇది వివిధ శీతోష్ణ స్థితులలో, పలురకాల భూముల్లో పండించబడుతుంది.

1902లో సామర్లకోటలో వ్యవసాయపరిశోధన కేంద్రం స్థాపించబడిన నాటినుంచి మన రాష్ట్రంలో వరిపై పరిశోధన జరుగుతున్నది. ఆ తరువాత, మారుటేరు, రాజేంద్రనగర్, అనకాపల్లి, బుచ్చిరెడ్డి పాలెం, రుద్రూరు, పూళ్ల, దిండి, మచిలీ పట్నం, కమలాపురాలో వరి బ్రీడింగుకై పరిశోధన కేంద్రాలు యేర్పాటు చేయబడినవి. ప్రస్తుతం దిగువ కేంద్రాలలో వరిపై పరిశోధన జరుగుతున్నది :

1. పరిశోధన - ప్రదర్శన క్షేత్రం, రాగోలు శ్రీకాకుళం జిల్లా.
2. వ్యవసాయ పరిశోధన కేంద్రం, అనకాపల్లి, విశాఖ జిల్లా.
3. వ్యవసాయ పరిశోధన కేంద్రం, సామర్ల కోట, తూర్పుగోదావరి జిల్లా.
4. వ్యవసాయ పరిశోధన కేంద్రం. మారుటేరు, పశ్చిమగోదావరి జిల్లా.
5. లోతునీటి బియ్యం పరిశోధన కేంద్రం, పూళ్ల, పశ్చిమగోదావరి జిల్లా.
6. చౌడు బియ్యం పరిశోధన కేంద్రం, మచిలీ పట్నం, కృష్ణా జిల్లా.
7. బియ్యం పరిశోధన కేంద్రం, మచిలీ పట్నం కృష్ణా జిల్లా.
8. బియ్యం పరిశోధన కేంద్రం, కమలాపురం, కడప జిల్లా.
9. పరిశోధన-ప్రదర్శన క్షేత్రం, యెమ్మిగనూరు కర్నూలు జిల్లా.
10. ప్రధాన వ్యవసాయ ప్రయోగ కేంద్రం, రాజేంద్ర నగర్, హైదరాబాదు.
11. బియ్యం పరిశోధన కేంద్రం, రుద్రూరు, నిజామాబాదు జిల్లా.
12. బొటానికల్ సెక్షన్ (బియ్యం) దిండి, ప్రాజెక్టు జిల్లా, నల్గొండ.

ఇంతవరకూ మొత్తం 79 రకాలు విడుదలై రైతులకి పంచబడుతున్నవి. ఈ వుత్తమరకాలు పంట క్రిందగల మొత్తం విస్తీర్ణంలో 80%ను ఆక్రమిస్తున్నాయని అంచనా. వీటిలో ముతక, మధ్య రకం, సన్నరకాలు, సువాసనగల రకాలుకూడా వున్నాయి. వీటిలో కొన్ని వర్షాధారమైన ప్రాంతాలకి, కొన్ని చెరువుల క్రింద సాగయే ప్రాంతాలకి అనువై వున్నాయి. ముంపు ప్రదేశాలకి, చౌడు ప్రాంతాలకి అనువైనవి కూడా వీటిలో వున్నాయి.

వరిధాన్యం రకాలు మున్నగువాటి అభివృద్ధికై యెంత కృషి జరిగినా, వేర్వేరు రకాల భూములు, శీతోష్ణస్థితులలో పెరిగే రకాల సాధన యింకా మిగిలి యేవున్నది. వివిధ ప్రాంతాలలో కొత్త పరిశోధన కేంద్రాల స్థాపనావశ్యకత చాలా తీవ్రంగా వున్నది. శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాల్లోని వర్షపు పరిస్థితులలో పెరిగే రకాల సాధనకై 1955లో స్థాపితమైన రాగోలు పరిశోధన-ప్రదర్శన క్షేత్రంలో కృషి జరుగుతున్నది.

రాయలసీమ జిల్లాల్లో చెరువుల క్రింద సాధారణంగా మధ్యకాలిక, దీర్ఘకాలిక రకాలు పెంచబడతాయి. కాని యిప్పటి వరకూ సాధించిన కొత్త రకాలు యీ ప్రాంతానికి అంత అనువుగా లేవు. భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం, రాష్ట్ర ప్రభుత్వాల అధ్వర్యాన కమలాపురంలో ప్రారంభమైన పరిశోధన కేంద్రం 1956 నవంబరు నుంచి పని చేస్తున్నది.

డెల్టా జిల్లాలైన వుభయ గోదావరులు, కృష్ణా, గుంటూరులలో అక్కుళ్లు, కొణామణి రకాలు మిక్కిలి ప్రసిద్ధమైనవి. అక్కడి భూములు సహజంగా సారవంతమైనవి. రసాయన యెరువుల స్వల్పవాడకాన్ని కూడా యీ రకాలు తట్టుకోలేవు. ఆయెరువుల వాడకంతో పంటలో 40%-50% నష్టం వస్తున్నది. ఇలా నష్టంరాని అక్కుళ్ల రకం సాధనకై మారుటేరులో కృషి జరుగుతున్నది. ఇంతవరకూ లభించిన ఫలితాలు ప్రోత్సాహకరంగా వున్నాయి.

రాష్ట్రంలో జపాను పద్ధతి వరిసాగు నానాటికీ అభివృద్ధి చెందుతున్నది. తెలంగాణా ప్రాంతంలో భూములు సహజంగా సారవంతమైనవి కావు. అక్కడ యీ పద్ధతి క్రింద పంటబాగా పండుతు

న్నది. ఆంధ్రలో డెల్టా జిల్లాల్లోని కొన్ని ప్రాంతాలలో రైతులు యీ పద్ధతిని పూర్తిగా అంగీకరించటం లేదు. వాడుకలో వున్న "ఇండికా" రకాల విషయంలో రసాయన యెరువుల్ని యెక్కువ వాడితే లాభంలేదు. ఆ యెరువుల వాడకంతో ఫలించే ఇండికా-జపానికా మిశ్రమ జాతిరకాల సాధనకై సామర్ల కోట, హిమాయత్‌నగర్, రుద్రూరు, దిండిలలో 'కృషి జరుగుతున్నది. ఈ మిశ్రిమ జాతి రకాలలో కొన్ని వాంఛనీయమైన లక్షణాల్ని చూపుతున్నవి.

జపాను పద్ధతిసాగు క్రింద రసాయన యెరువుల్ని యెక్కువగా వాడ్డం చాలా ముఖ్యం. ఈ పద్ధతి సాగు అమలులోకి రావడంతో రాయలసీమ జిల్లాల్లో విస్తార ప్రాంతాలలో పైరుకి, 'బ్లాస్ట్' వ్యాధి వస్తున్నది. తెలంగాణాలోను, డెల్టా జిల్లాల్లోను కూడా యీ వ్యాధివ్యాప్తి దాని నివారణకి యేకైక మార్గం దాన్ని నిరోధించే రకాల సాధనయే. ఇట్టి రకాల సాధనకై బుచ్చిరెడ్డిపాలెం బియ్యం పరిశోధన కేంద్రంలో పని జరుగుతున్నది. భారతీయ వ్యవసాయ పరిశోధన కేంద్రం 'బ్లాస్ట్'ను నిరోధించే రకాల సాధనకై ఒక సమగ్ర పథకాన్ని మంజూరు చేసింది.

చౌడువల్ల సాలీనా యించుమించు 2 లక్షల యెకరాలలోని వరిపైరు పాడవుతున్నది. మచిలీపట్నంలోని బియ్యం పరిశోధన కేంద్రం ముఖ్యంగా చౌడు భూములలో బాగా పెరిగే రకాల సాధనకై వుద్దేశింపబడింది. ఇక్కడ సాధించబడిన నాలుగు రకాల్ని రైతులు బాగా వాడుతున్నారు.

ముంపు ప్రదేశాలలో పెరిగే వరి రకాల సాధనకై పూళ్ల లోతునీటి బియ్యంపరిశోధన కేంద్రంలో కృషి జరుగుతున్నది. పశ్చిమ గోదావరి జిల్లాలో కల్లేరుకి సమీపంలో 327 చ. మైళ్ల విస్తీర్ణంగల పల్లంవున్నది. అది సారవంతమైన భూమి అయినందున వరి పంటకి అక్కడ యెంతో అవకాశం వున్నది. ముంపును, వరదల్ని తట్టుకోగల రకాలు సాధించబడినట్లయితే అక్కడ ప్రథమ పంటలో అధమం 2,000 టన్నుల బియ్యాన్ని పండించవచ్చు. పల్లం భూములు దాదాపు ప్రతి జిల్లాలోను, తాలూకాలోను, గ్రామంలోను కూడావుంటాయి. అక్కడ ముంపుకాగే రకాల్ని మాత్రమే పండించటం సాధ్యం.

తెలంగాణా ప్రాంతంలో, డిసెంబరు నెలలో పోసే రెండవ పంట నారు మళ్లు, విత్తనాలు జల్లిన 7.8 వారాలకి కాని వూడ్పుకిరావు. 'ఆబీ'లో యీ కాలం 4 వారాలు మించదు. రెండవ పంట రకాలు 3,4 నెల్లకి కాని పంటకిరావు. పంట కాలంలో నాలుగింట మూడువంతులు నారుమడిలోనే గడిచిపోతుంది. ఫలితం, తక్కువ యెకరా వుత్పత్తి. నారుమళ్లు త్వరగా పెరిగే సాధనంవున్నట్లయితే ధాన్యం వుత్పత్తిని 34%, గడ్డి వుత్పత్తిని 51% వరకూ హెచ్చించవచ్చునని ప్రాథమిక ప్రయోగాలవల్ల సూచిత మవుతున్నది. ఈ విషయంలో పూర్తి పరిశోధనలకవకాశమిచ్చే పథక మొకటి మంజూరయింది రాజేంద్రనగర్‌లో యిటీవలే యిందుకు సంబంధించిన పని చేపట్టబడింది. ఈ పథకం భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం, రాష్ట్ర ప్రభుత్వాల సమష్టి ఖర్చుపై అమలు జరుగుతుంది.

ఆదిలాబాదు జిల్లాలో వర్షాధారమైన భూమి యించుమించు ఒక లక్షయెకరాలు వుంది. ఇచ్చట సాగయే వరి రకాల సాధనకై యిటీవల ఒక పథకం మంజూరు చేయబడింది.

శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు, పశ్చిమ గోదావరులు, కృష్ణలవంటి కోస్తా జిల్లాల్లోను, కొన్ని తెలంగాణా జిల్లాల్లోను కూడా వరి ముఖ్యంగా నీటి పారుదల క్రింద సాగవుతుంది. అట్టి ప్రదేశం రాష్ట్రం మొత్తం మీద 15 లక్షల యెకరాలున్నది. దాని కనువైన రకాల సాధనకై ఒక పథకం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడింది. దాని ఆమోదానికై నిరీక్షించబడుతున్నది

రెండవ పంటకి స్వల్పకాలిక రకాల సాధనకైన రాజేంద్రనగర్, రుద్రూరు, పూళ్ల, మారుటేరు సామర్ల కోటలలో కృషి జరుగుతున్నది. తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతానికనువైన రకాల విషయంలో

యెమ్మిగనూరులో పరిశీలనలు జరుగుతున్నాయి. తగిన యెరువు షెడ్యూళ్లు కూడా తయారు చేయబడుతున్నాయి.

జపాను పద్ధతి వరిసాగు క్రింద మొక్కల్ని వరుసలలో నాటటం, 'జాప్‌వీడర్'ని వుపయోగించటం ముఖ్యం. ఊడ్పులు జరపుటకు వీలులేక ఒకేసారి విత్తనాలు జల్లే భూమి విషయంలో యీపద్ధతి పనికిరాదు. అట్టి ప్రాంతం రాష్ట్రంలో వరి పండే ప్రాంతంలో దాదాపు మూడింట రెండు వంతులున్నట్లు అంచనా. ఈ ప్రాంతంలో విత్తనాలు డ్రిల్లింగు మున్నగు పద్ధతులలో జల్లబడతాయి. మొక్కలు వచ్చిన విత్తనాల్ని బాగా దమ్ముచేసిన నేలలో వరుసలలో నాటినట్లయితే, మామూలుగా విత్తనాలు జల్లినప్పటి కంటే పంట 21% పెరుగుతుందని, గడ్డి కూడా 33% యెక్కువ లభిస్తుందని రాజేంద్రనగర్‌లో జరిగిన పరిశీలనల వల్ల తేలింది. ఈ పద్ధతి క్రింద విత్తనాలు పొదుపు కావడమే కాక కలుపుతీత ఖర్చు కూడా తగ్గుతుంది. ఎందుకంటే, అప్పుడు 'జాప్‌వీడర్'ని వుపయోగించే అవకాశం వుంటుంది.

నెల్లూరు మండలంలోని మొలగొలుకులు (బిసిపి. 1. బిసిపి, 2), జి ఇబి., 24. ఎమ్ టి యు. 8 (వంకి సన్నాలు), ఎమ్ టి యు. 13 ఎస్ ఎల్ ఐ. 16 (కాశిపి చోడి) బసుమాటి, సువాసన బియ్యం హెచ్ ఆర్ 22, హెచ్ ఆర్ 47, హెచ్ ఆర్ 69 రకాలు మన దేశంలోనే కాక విదేశాలలో కూడా ప్రసిద్ధికెక్కినవి. ఎగుమతికై యీ రకాల విత్తనాల వుత్పత్తిని హెచ్చించాలని సంకల్పించబడింది.

2. మెట్టధాన్యాలు : ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం 110 లక్షల యెకరాలలో సాలీనా 23 లక్షల టన్నుల మెట్టధాన్యాలు పండించబడతాయని అంచనా. వీటిలో ముఖ్యమైనవివి: జొన్న, కొఱ్ఱ, రాగి, వరిగ. రాష్ట్రం వివిధ ప్రాంతాల కనువైన యెక్కువ పండే రకాల సాధనకై లాం, నంద్యాల, ఒంగోలు, పెద్దాపురం, విజయనగరం, రాజేంద్రనగర్‌లలోని వ్యవసాయ పరిశోధన కేంద్రాలు మున్నగు వాటిలో కృషి జరుగుతున్నది. స్థానిక రకాల కంటే 10-15% యెక్కువ పండే రకాలు జొన్నలో 24, రాగిలో 9, కొఱ్ఱలో 6, సజ్జలో 3, వరిగలో 1 సాధించబడినవి. ఈ వుత్తమరకాలు పూర్వాంధ్ర రాష్ట్రంలో మెట్టధాన్యాల క్రింద గల మొత్తం ప్రదేశంలో నాలుగవ వంతులో పండించబడుతున్నాయి. అవికాక, వృద్ధిలోకి రాగల మరి కొన్ని రకాలు, స్థానిక రకాల కంటే మెరుగవునో కాదో తెలుసుకొనుటకై రైతుల కమతాలలో ప్రయోగాత్మకంగా పండించబడుతున్నాయి. ఉత్తమ పంట సాధనకై సాధించిన వుత్తమ వ్యవసాయ పద్ధతులు (జల్లవలసిన విత్తనాల పరిమాణం, మొక్కల మధ్య దూరం, పంటల మార్పిడి, యెరువు వేత మున్నగు విషయాలు) రైతులకెరిగించబడినవి. 'స్ట్రెయిగా' చీడవల్ల జొన్న పంట వుత్పత్తి బాగా తగ్గుతున్నది కాబట్టి ఈ చీడకులోనుగాని జొన్న రకాల్ని సాధించటానికీ, దాని నివారణకనువైన రసాయన పద్ధతులు మున్నగు వాటిని కనుగొనుటకు నంద్యాల, లాం (గుంటూరు) వ్యవసాయ పరిశోధన కేంద్రాలలో కృషి జరుగుతున్నది.

మెట్ట ధాన్యాలలో అధిక భాగం వర్షాధారమైన భూములలో పండుతాయి. ఒక్కొక్క రకం ఒక్కొక్క రకం నేల, పరిస్థితులలోనే పండుతాయి. కాబట్టి వాటి అభివృద్ధికి ప్రాంతీయ ప్రాతిపదికపై కృషి జరగాలి. ఈ దృష్ట్యా, ఆంధ్ర ప్రాంతానికి 7, తెలంగాణా ప్రాంతానికి 3 ప్రాంతీయ కేంద్రాలు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చేర్చబడినవి. మిశ్రమ జాతి సజ్జ, జొన్నల వుత్పత్తికై కొత్తగా పరిశోధన ప్రారంభింపబడింది.

3. కాయధాన్యాలు : మన రాష్ట్రం ముఖ్యమైన ఆహార పంటలలో యివికూడా చేరివున్నాయి. ఇవి రాష్ట్రమంతటా విడిగా కాని, వరిమున్నగు ప్రధాన పంటలతో కలిపి కాని పండించబడతాయి. సాలీనా 19.48 లక్షల యెకరాలలో యివి పండించబడతాయని అంచనా. వీటి అభివృద్ధికై [illegible] వాటికి గల ప్రాముఖ్యానికి తగిన కృషి జరగలేదు. సమష్టి మద్రాసు రాష్ట్రంలో ఆంధ్ర ప్రాంతంలో వీటి అభివృద్ధికై భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం ధనసహాయంతో 1944లో విజయనగరంలో

ఒక సబ్-స్టేషన్ ప్రారంభింపబడింది. ఈ పథకం 1953 పూర్వార్థంలో ముగిసింది. ఈ కాలంలో అక్కడ కందులు, పెసలు, మినుగులు, వులవల విషయంలో పరిశోధన ప్రారంభింపబడింది. దిగువ కొత్త రకాలు పంపిణీ చేయబడుతున్నాయి.

కందులు : ఆర్. జి. 72, ఆర్, జి, 97

పెసలు : మెట్టభూములలో పెంపకానికి : జి జి. 127. మాగాణీ భూములలో పెంపకానికి : జి జి. 168.

మినుగులు : మెట్టభూములలో పెంపకానికి : జి. జి. 189.

ఉలవలు : హెచ్. జి. 76 (బఫ్ రకం), హెచ్. జి. 93 (నల్లరకం)

భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం ఆర్థిక సహాయంపై సమిష్టి హైదరాబాదు రాష్ట్రంలో కూడా కాయధాన్యాల అభివృద్ధికై 1944 - 54 మధ్య రైచూర్, వరంగల్లులలో కృషి జరిగింది. రైచూర్‌లో కందులు, సెనగల విషయంలోను, వరంగల్లులో కందులు, వులవల విషయంలోను పని జరిగింది. ఈ రెండు కేంద్రాలలోను, సాధించబడిన రకాలుయింకా జిల్లా ప్రయోగాల క్రింద వున్నాయి. అవి యివి :

రైచూర్ : కందులు : 76-23 92-25, 20-36, 301.
సెనగలు : 32-102, 58-24, 63-41, 63-86.

వరంగల్లు : కందులు : నెం. 4, 5, 11.
ఉలవలు : నెం. 33, 34, 42, 44.

రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ పిమ్మట, రాష్ట్రంలో కాయధాన్యాల అభివృద్ధికి పూర్తిగా కృషి జరుగుటకై ఒక కాయధాన్యాలనిపుణుడు నియమింపబడ్డారు. ఆయన ముఖ్య కార్యాలయం రాజేంద్రనగర్‌లో వుంది. పెద్దాపురంలో ఒక సబ్-స్టేషన్ వుంది.

ఆంధ్ర ప్రాంతంలో సామర్లకోట, గుంటూరు, అనంతపురాలలో కాయధాన్యాల అభివృద్ధి కృషికై భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం ఒక పథకాన్ని మంజూరు చేసింది

4 నూనెగింజలు : రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ పిమ్మట నూనెగింజల విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రాముఖ్యం బాగా హెచ్చింది. భారతదేశంలో నూనెగింజల క్రిందవున్న మొత్తం భూమి 2,94,71,000 యెకరాలలో 47,00,000 యెకరాల భూమి ఆంధ్రప్రదేశ్‌లో వున్నది. ఇక్కడ వేరుసెనగ, ఆముదాలు, నువ్వులు భారీ యెత్తున పండించబడతాయి. వివరాలు యివి.

| పంట | విస్తీర్ణం-యెకరాలలో | ఉత్పత్తి-టన్నులలో |
|---|---|---|
| వేరుసెనగ | 31,09 000 | 10,85,000 |
| ఆముదాలు | 8,39,000 | 63,000 |
| నువ్వులు | 6,75,300 | 51,000 |

మనవాడకానికేమి, యెగుమతికేమి భారతదేశంలో వనస్పతి నూనెలు తక్కువగా వున్నాయి. కాబట్టి నూనెగింజల యెకరావుత్పత్తి, గింజలలో నూనె నిష్పత్తుల హెచ్చింపుకి కృషి జరగడం చాలా ముఖ్యం.

## ఆముదాలు

రాజేంద్రనగర్ క్షేత్రంలో ఆముదాలపై చాలా పరిశోధనలు జరిగాయి. తత్ఫలితంగా పెక్కు రకాల విత్తనాలు సాధించబడినవి. వాటిలో కొన్ని తెలంగాణా ప్రాంతంలోనే కాక యితర రాష్ట్రాలలో కూడా పెంచడానికి అనువుగా వున్నాయి. హెచ్. సి. 6 రకం విత్తనాల్ని హెచ్చుగా వుత్పత్తిచేసి తెలంగాణాలో పంపిణీ చేయడం జరుగుతున్నది. వీటి క్రింద 75,000 యెకరాలున్నాయి. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆఖరు నాటికి వీటి క్రిందకి 5,00,000 యెకరాలు రాగలవని ఆశించబడుతున్నది. ఈరకం విత్తనాల వల్ల గింజల వుత్పత్తి 15%, గింజలలో నూనె నిష్పత్తి 2% హెచ్చుతుంది. కొన్ని రకాల మిశ్రమంవల్ల యేర్పడిన రకాలు నూనె నిష్పత్తి విషయంలో హెచ్. సి. 6 కంటె కూడా వుత్తమంగా వున్నాయి. (గింజల్లో నూనె

నిష్పత్తి : స్థానిక రకాలు : 46%, హెచ్. సి. 6 :. 49%, మిశ్రమజాతి రకాలు : 55-56%). వీటిలో కొన్ని రకాల్ని త్వరలోనే రైతులకి పంపిణీ చేసే అవకాశమున్నది. మద్రాసు రాష్ట్రపుటిండివనంలో సాధించబడిన ఆముదం విత్తనాలు టి. ఎమ్. వి. 1 ఆంధ్రప్రాంతానికి తగివున్నాయి. కాబట్టి అవి అక్కడ పంపిణీ చేయబడుతున్నాయి.ఇందునిమిత్తం కోసిగి, కదిరిలలో రెండు మండల విత్తన క్షేత్రాలు పనిచేస్తున్నాయి.

ఎకరానికి 12 పౌనుల విత్తనాలు జల్లితే పంట బాగా పండుతుందని రాజేంద్రనగర్ క్షేత్రంలో జరిగిన యితర ప్రయోగాల వల్ల తేలింది. అలాగే మంచి పంటకి వరసకీ వరసకీ మధ్య 3 అ. యెడం, మొక్కకీ మొక్కకీ మధ్య 1 1/2 అ. యెడం వుండాలి. నిర్ణీత పరిమాణంలో యెరువు వాడకం ద్వారా వుత్పత్తిని హెచ్చించవచ్చు. కాని లాభ నష్టాలు మాత్రం అమలులో వున్న ఆముదం గింజల ధరపై ఆధారపడి వుంటాయి. కాయలు పూర్తిగా ముదిరిన తరవాత కోస్తే నూనె యెక్కువగా వుంటుంది. ఈ అభివృద్ధి విధానాలన్నీ రైతులికి తెలియ చేయబడు తున్నాయి.

## వేరుశెనగ

ఇటీవల ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో వేరుసెనగ పంటపై పరిశోధన కార్యక్రమం ప్రారంభింప బడింది. ఈ పంట క్రిందగల భూమిలో అత్యధిక భాగం రాయలసీమలో వున్నందున పరిశోధన కేంద్రం అనంతపురంలో నెలకొల్ప బడింది. వేరుసెనగ, ఆముదం పంటలపై పరిశోధన ప్రారంభమైంది. ఉత్తమరకం విత్తనాల క్రింద యించు మించు 3,00,000 యెకరాలున్నట్టు అంచనా. ఈ పనిని యింకా హెచ్చుగా జరిపే పథకాలు పరిశీలనలో వున్నాయి.

## నువ్వులు

ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో యెక్కడా కూడా నువ్వుపంట అభివృద్ధికై యింతవరకూ కృషి జరుగలేదు. కాబట్టి యిప్పుడు కరీంనగరంలో నువ్వు పంట పరిశోధన కేంద్రం స్థాపనకై ఒక పథకం మంజూరు చేయబడింది. విశాఖపట్నంలో అట్టి కేంద్రం స్థాపన నుద్దేశిస్తున్న పథకం ప్రభుత్వ పరిశీలనలో వుంది.

## సాధారణ విషయాలు

పొలంగట్లు, కాలవగట్లు మున్నగు వాటిపై ఆముదం మొక్కల్ని పెంచుటకు గల అవకాశాలు మున్నగు వాటిని పరిశోధించ వలసి వున్నది.

వేరుసెనగ విషయంలో, అలుముకునే రకాల కంటె యెక్కువ పండే నిటారు రకాల్ని సాధించ వలసి వుంది. డెల్టా ప్రాంతంలో వరిపొలాల్లో రెండవ పంటగా వేరుసెనగని పండించుటకు గల అవకాశాల్ని పరిశీలించాలి. చక్కని పంటకి సరిగ్గా యెంత యెరువు వేయాలో కూడా నిర్ణయించ వలసి వున్నది.

తెలంగాణాలో వ్యవసాయపరిశోధన అభివృద్ధికై కేంద్ర ప్రభుత్వం త్వరలోనే ఒక ప్రాజెక్టును ప్రారంభించ నున్నది దీనితో పరిశోధన కార్యక్రమం ప్రగతి హెచ్చడం ఖాయం.

## 5. కొబ్బరి

ఆంధ్రలో కొబ్బరి తోటల విస్తీర్ణం 84,635 యెకరాలు. వీటిలో చాలభాగం తూర్పు, పశ్చిమ గోదావరులు, శ్రీకాకుళం, కృష్ణా జిల్లాల్లో వున్నాయి. ఇవియేటా 31,12,41,000 కాయలు కాస్తాయి. మొత్తం దేశానికి చాలినన్ని కొబ్బరి కాయల్లేవు. ఈ లోటును భర్తీ చేసుకొనుటకు 55,00,00,000 కాయల్ని దిగుమతి చేసుకొనడం జరుగు తున్నది. ఆంధ్రప్రదేశ్‌లో హెచ్చు వుత్పత్తి లక్ష్యం 6,60,00,000 కాయలుగా నిర్ణయించ బడింది. ఈ లక్ష్య సిద్ధికై ప్రస్తుతపు తోటల్ని తీవ్రంగా సాగుచేయాలి. ఈ విషయంలో ప్రచారం జరుపుటకు, మొక్కల రక్షణకై చర్య తీసుకొనుటకు. సంవత్సరానికి 1,12,000 నారు మొక్కల్ని రసఫరా చేయుటకై 4 కొత్తనారు పెంపక కేంద్రాల్ని స్థాపించుటకు ప్రభుత్వం ఆలోచిస్తున్నది. మన రాష్ట్రంలో యిప్పటికే 7 నారు

పెంపక కేంద్రాలున్నాయి. అవి సాలీనా 59,000 నారు మొక్కల్ని వుత్పత్తి చేస్తున్నాయి కొబ్బరి తోటలకి సంబంధించి యెరువు వేత, మొక్కల మధ్య వుండవలసిన దూరం మున్నగు వాటి పరిశీలనకై యిటీవల తూర్పుగోదావరి జిల్లా అంబాజీపేటలో ఒక పరిశోధన కేంద్రం స్థాపింపబడింది. కొబ్బరి తోటలకి నష్టకరమైన వ్యాధులు, చీడల నివారణకి సంబంధించిన పథకాలు పరిశీలనలో వున్నాయి. ఈ తోటల్ని వేధించే కీటకాలపై జీవించే జీవులు కొన్ని వున్నాయి. వాటి వ్యాప్తి వల్ల ఆ కీటకాలునశిస్తాయి. కాబట్టి పరాన్న భుక్కులైన అట్టి జీవుల్ని పెంచే కేంద్రం ఒకటి రాజోలులో పనిచేస్తున్నది. కొబ్బరి తోటలు గల ప్రాంతాలికి అవి పంపబడు తున్నాయి. రాగోలు, అంబాజీపేటలలో కూడా అట్టి పరాన్న భుక్కుల పెంపక కేంద్రాల స్థాపన విషయం పరిశీలనలో వున్నది.

## 6. ప్రత్తి

మన రాష్ట్రంలో 10.34 లక్షల యెకరాలలో ప్రత్తి పండించ బడుతున్నది. ఈ విస్తీర్ణం ముఖ్య పంటల క్రిందగల భూమి విస్తీర్ణంలో దాదాపు 1.5%. ప్రత్తి సగటు వుత్పత్తి 1,27,000 బేళ్లు (బేలు 392 పౌనులు). మన రాష్ట్రంలో ప్రత్తి పండే ప్రాంతాలు 5 వున్నాయి. ఆ ప్రాంతాలు, అక్కడ పండే రకాలు మున్నగు వివరాలు దిగువ యివ్వబడినవి.

1. వెస్ట్రన్సు ప్రాంతం: అనంతపురం జిల్లా గుత్తి, తాడిపత్రి, వురవకొండ, రాయదుర్గం తాలూకాలు, కడప జిల్లా జమ్మల మడుగు, ప్రొద్దుటూరు తాలూకాలు, కర్నూలు జిల్లా ఆలూరు' ఆదోని, పత్తికొండ తాలూకాలు యీ ప్రాంతం క్రిందికి వస్తాయి. ఈ ప్రాంతం విస్తీర్ణం రాష్ట్రంలో ప్రత్తి క్రిందగల మొత్తంభూమి విస్తీర్ణంలో దాదాపు 35%. హగరి వ్యవసాయ పరిశోధన కేంద్రంలో సాధించబడిన వెస్ట్రన్సు 1 యీ ప్రాంతం అధిక భాగంలో పండించబడుతున్నది. దీని పింజ పొడుగు 7/8 అం. నుంచి 13/16 అం. వరకూ వుంటుంది. గిన్నింగు శాతం 28. స్పిన్నింగు విలువ 26. ఇది యీ ప్రాంతంలో యెక్కువగా వాడబడుతున్నా యితర రకాలతో పోల్చినప్పుడు దీని వుత్పత్తి పరిమాణం తక్కువ. కాబట్టి అనావృష్టి పరిస్థితులలో కూడా పెరిగి, త్వరగా పంటకి వచ్చుట మున్నగు లక్షణాలు గల మధ్యరకం పింజ ప్రత్తిరకం సాధనకై ఆదోనిలో ఆంధ్ర, మైసూరు రాష్ట్ర ప్రభుత్వాలు, బొంబాయిలోని భారతీయ కేంద్ర ప్రత్తి సంఘాల సమష్టి యాజమాన్యాన సమన్వయపరచబడిన ఒక పథకం అమలు జరుగుతున్నది.

2. నార్తరన్ల ప్రాంతం: కర్నూలు జిల్లా నంద్యాల,నందికొట్కూరు, కోయిల్కుంట్ల, బనగానపల్లి, ఆళ్లగడ తాలూకాలు యీ ప్రాంతంలో చేరుతాయి. దీని విస్తీర్ణం 12 లక్షల యెకరాలు. నంద్యాల వ్యవసాయ పరిశోధన కేంద్రంలో సాధించబడిన రకం నెం. 14 సాలీనా 30,000 యెకరాలలో సాగవుతున్నది. దీని పింజ పొడుగు 7/8 అం. మొదలు 15/16 అం వరకూ వుంటుంది. గిన్నింగు శాతం 24. స్పిన్నింగు శక్తి యించుమించు 40'ల వార్పు కౌంట్లు. ఇది మంచి రకం దారాన్నిచ్చి నప్పటికీ దీని గిన్నింగు శక్తి తక్కువ కావడాన రైతులు దీన్ని చటుక్కున వాడరు. గట్టితనంలోను, సన్ననూలు నిచ్చుటలోను దీనికి సమానమై, దీనికంటె పొడుగు పింజను, యెక్కువ గిన్నింగు శాతాన్ని (30 పైన) కలిగిన రకం సాధనకై భారతీయ కేంద్ర ప్రత్తి సంఘం ధనసహాయంతో నంద్యాల వ్యవసాయ పరిశోధన కేంద్రంలో ఒక పథకం అమలు జరుగుతున్నది. ఇక్కడ నాణ్యం కలిగి యెక్కువ వుత్పత్తి అయే రకాలు లభించే శుభసూచనలు కనబడుతున్నాయి.

"ఆంధ్రా అమెరికన్"అని పేరుగాంచిన లక్ష్మి ప్రత్తి మైసూరు రాష్ట్రంలోని గడగ్‌లో సాధించబడింది. ఇది మేలు రకం నూలునిస్తుంది. ఎక్కువ పండుతుంది. కాబట్టి రైతులు దీనిని యెక్కువగా వాడుతున్నారు. వారు యీ రకం ప[illegible] విత్తనాల్ని తమంతట తాము దిగుమతి చేసు[illegible]

వారు. పై రెండు ప్రాంతాలలోను కలిపి యీ రకం క్రింద మొత్తం 3 లక్షల యెకరాలు సాగవుతున్నాయి. ఇదికాక ఆంధ్రప్రభుత్వం గడగ్‌నుంచి మంచిరకం విత్తనాలు 8ి0 ఇంపీరియల్ మణుగుల్ని సేకరించి, వాటిని ముఖ్యంగా తుంగభద్ర ప్రాజెక్టు ప్రాంతంలో పంపిణీ చేస్తున్నది. దీనిపింజ పొడుగు 7/8 అం. నుంచి 15/16 అం. వరకూ వుంటుంది. గిన్నింగు శాతం 34. స్పిన్నింగు శక్తి 40'ల వార్పు కౌంట్లు. మామూలు పరిస్థితులలో యిది బాగా పండి నప్పటికీ, అతివృష్టి అనావృష్టి కాలాల్లో తక్కువ పండింది. 'బ్లాకారమ్' మున్నగువాటికి లొంగకుండా వుంటూ ఎక్కువపండే అమెరికన్‌రకం సాధనకై భారతీయ కేంద్ర ప్రత్తి సంఘం ధన సహాయంతో నంద్యాల వ్యవసాయ పరిశోధన కేంద్రంలో కృషి జరుగు తున్నది.

3. ముంగారీ ప్రాంతం : కర్నూలు, అనంతపురం, కడప జిల్లాల్లోని ఎరుపు నేలలు, ఓమోస్తరు నల్లరేగడ భూములు యీ ప్రాంతం క్రిందికి వస్తాయి. ఇక్కడ ముందు పంటకి వచ్చే ప్రత్తిరకం వేయబడుతుంది. దీని విస్తీర్ణం లక్ష యెకరాలు. 881 ఎఫ్ (ఇప్పుడు రాయలసీమ 1, అనే మధ్యరకం పింజ ప్రత్తిరకం ఒకటి ఆదోనిలో సాధించ బడింది. ఇది స్థానిక ముంగారీ కంటె మంచిది. కాని యిది ఆలస్యంగా పంటకి వస్తుంది. దీని గిన్నింగు శాతం తక్కువ. కాబట్టి దీనికి గల మేలిగుణాలతోపాటు, ముందుగా పంటకు వచ్చి, యెక్కువ గిన్నింగు శక్తిగల రకం సాధనకై భారతీయ కేంద్ర ప్రత్తి సంఘం ధన సహాయం చేసే పథకంక్రింద కృషి జరుగుతున్నది. నెంబర్లు: 6930 ఎ, 3943 బి యీ ఆశయాన్ని సఫలం చేసేట్టు కనబడ్డాయి. మిశ్రమపంట పరిస్థితులకి అవి యెంతవరకూ తగి వున్నాయో తెలుసుకొనుటకు మరొక పథకంకూడా పై కేంద్ర సంఘం ధన సహాయంతో ఆదోనిలో అమలు జరుపబడుతున్నది. ఈ రకాల విత్తనాలు వేరుశనగవంటి పంటలతో వివిధ నిష్పత్తులలో కలిపి చల్లబడు తున్నాయి.

4. కాకినాడల ప్రాంతం : ఉత్తర సర్కారుల లోని మెట్ట ప్రదేశాలు యీ ప్రాంతం క్రిందకి వస్తాయి వరుసగాలాం, నరసరావు పేటలలో సాధించ బడిన సి. 1., సి. 2 రకాలు యీ ప్రాంతానికి తగి వున్నాయి. వీటి పింజ పొడుగు 7/8 అం. గిన్నింగు శాతం 28. స్పిన్నింగు విలువ 30'లు. ప్రస్తుతం కాకి నాడల రకం ప్రత్తి తెల్లగా వుండదు. అందుచేత యెక్కువ గిన్నింగు శాతంగల తెల్లటి మధ్యరకం పింజ ప్రత్తి రకాన్ని సాధించుటకు నరసరావు పేటలో ఒక పథకం, భారతీయ కేంద్ర ప్రత్తి సంఘం ధన సహాయంతో, అమలు జరుపబడు తున్నది.

5. గౌరానీ ప్రాంతం : పూర్వ హైదరాబాదు రాష్ట్రి గౌరానీ రక్షిత ప్రాంతం కొంత ఆదిలా బాదు నిజామాబాదు జిల్లాల్లో వుండి పోయింది. ఈ ఈశాన్య మండలంలో ముధోల్, భైనియా ప్రాంతాలు చేరివున్నాయి. ముధోల్ ప్లాన్‌బ్రీడింగు స్టేషన్‌లో లభించిన ఫలితాలే వీటికి వుపకరిస్తాయి. ఇంతకుముందు సాధించబడిన గౌరానీ 6 యిప్పుడీ ప్రాంతంలో వ్యాపిస్తున్నది. దీని గిన్నింగు శక్తి 31 శాతం. పింజ పొడుగు 7/8 అం. దీనినుంచి 34'ల దారం వస్తుంది. దీనికంటె మేలురకాలు కొన్ని ముధోల్‌లో పరిశీలించబడుతున్నాయి. ఇది గాక ఆదిలాబాదు అమెరికన్ మండలంలోని బోత్, వుట్నూరు ప్రాంతాలలో పెరుగుటకు పర్భని అమెరికన్-1 తగి వున్నది. దీని గిన్నింగు శాతం 31. స్పిన్నింగు విలువ 39'లు. ఈ మండలం విస్తీర్ణం యించుమించు లక్ష యెకరాలు.

మన రాష్ట్రంలో కేంద్ర ప్రభుత్వ ధన సహాయంతో ఒక ప్రతి విస్తరణ పథకం అమలు జరుగుతున్నది. దీని క్రింద లక్ష్మి, హెచ్. 14, డబ్ల్యు 1 ల వంటి వుత్తమరకం ప్రతి విత్తనాల్ని రాష్ట్రంలో వుత్పత్తి చేసి లేక యితర రాష్ట్రాల నుంచి సేకరించి రైతులకి పంపిణీ చేయబడుతున్నాయి. 1956—67 లో లక్ష్మి ప్రతి విత్తనాలు 2,411 ఇంపీరియలు మణుగులు, హెచ్. 14 విత్తనాలు 7½ ఇం. మ. డబ్ల్యు 1 విత్తనాలు 2,575 ఇం. మ. పంపిణీచేయబడినవి.

7. చెఱకు : మన రాష్ట్రంలో పంచదార పరిశ్రమ భారీ పరిశ్రమ. ఆంధ్ర రైతుల ఆర్థిక వ్యవస్థలో చెఱకు పంట చాల ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. ఆంధ్రప్రదేశ్‌లో మొత్తం 1,74,000 యెకరాలలో చెఱకు పండించబడుతుంది. మన రాష్ట్రంలో చెఱకు సగటు యెకరా వుత్పత్తి 29.26 టన్నులని అంచనా. యావద్భారత దేశానికి యీ సగటు యెకరా వుత్పత్తి యించుమించు 13 టన్నులు. చెఱకు వుత్పత్తిని, నాణ్యాన్ని హెచ్చించుటకు అనకాపల్లి చెఱకు పరిశోధన కేంద్రంలో కృషి జరుగుతున్నది. చెఱకుసాగు వివిధ అంశాలకి సంబంధించిన సమస్యల పరిష్కారానికై వివిధ విభాగాలలో కృషి జరుగుతుంది. గత రెండు దశాబ్దాలలో జరిగిన పరిశోధనల ఫలితంగా మూడు రకాలు సాధించబడినవి. 1 సి.ఓ 527, 2. సిఓ. 449, 3. సిఓ. 419 ఇవి సాగుకై విడుదల చేయబడినవి. ఇవి వరుసగా ఆంధ్రలో ముందుగా, మధ్య కాలంలో, ఆలస్యంగా, చెఱకును ఆడే పంచదార ఫ్యాక్టరీలకై వుపయోగింప బడతాయి. 1956-57 లో మరొక మంచిరకం అనగా సిఓ 997 కనిపెట్టబడింది. ఎక్కువ వుత్పత్తి చేసి, రైతులకి పంపిణీ చేయబడుటకై అది విడుదల చేయబడింది. ఇదిత్వరగా పంటకి వస్తుంది. దీని రసంలో 19.59 శాతం చక్కెర వుంది

చెఱకు సాగు అభివృద్ధి విషయంలో చేయబడిన యితర సూచనలు యివి: 1. 8 అం. లోతుగల పొడుగు పాటగోతులలో నాటాలి. 2. బాగా ముదరని గెడల్ని విత్తనాలుగా వుపయోగించాలి. వీటిని స్వల్ప కాలిక చెఱకు తోటల నుంచి సేకరించ వచ్చు లేదా చెఱకు గెడలపై భాగాలను వుపయోగించవచ్చు. 3. సాగు ఖర్చును తగ్గించుటకు ఆపు కట్టుటలో 'ట్రాష్ట్విష్టు', పద్ధతిని వుపయోగించాలి. 4. సేంద్రియ, రసాయన యెరువుల మిశ్రమాన్ని వాడాలి. భూసార స్థాయిని బట్టి తోటల విషయంలో యెకరానికి 1,2 వందల పౌన్ల నత్రజని చొప్పున మార్సిడి పంటల విషయంలో యెకరానికి అదనంగా మరొక 50 పౌన్ల నత్రజని చొప్పున వాడాలి 5. చెఱకు అడుటకు మేలు రకం చెఱకు మిల్లుల్ని, బెల్లం తయారీకి మేలురకం ఫర్నెస్‌లను వుపయోగించాలి. 6. రసాయన మందుల్ని జల్లి కీటకాలను నివారించాలి. 7. నిరోధ, నివారణ చర్యల ద్వారా తెగుళ్లను రూపుమాపాలి.

ఎక్కువ నాణ్యమైన బెల్లం తయారీ విషయంలో కూడా పరిశోధనలు జరుప బడినవి. ఫలితాలు చెఱకు వుత్పత్తిదార్లు అవలంబించుటకు అందుబాటులో వున్నాయి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో చెఱకు పరిశోధన, విస్తరణ కార్యక్రమాలుబాగా హెచ్చాయి. చెఱకు సమగ్రాభివృద్ధి, పరిశోధనలకై వుద్దేశించిన పథకం ఒకటి మంజూరైనది. దీని వ్యయం దాదాపు రూ. 24.44 లక్షలు. చెఱకుతోటల పెంపకానికి సంబంధించిన వివిధ సమస్యలపై తీవ్ర పరిశోధన జరుగుతున్నది. కీటకాలు, తెగుళ్ళ నివారణ, బెల్లం తయారీ, నిలవల విషయంలో కూడా పరిశీలనలు చేపట్ట బడ్డాయి. రాష్ట్రంలో చెఱకు అధికోత్పత్తికి వుద్దేశించ బడిన విస్తృతాభివృద్ధి పథకం అమలు జరుపబడు తున్నది, సంకల్పించిన 5 మండల కేంద్రాలలోను బొబ్బిలి, సామర్లకోటలలోని రెండు కేంద్రాలు అప్పుడే పని ప్రారంభించాయి. మేలురకం చెఱకు సాగు విధానాలను ప్రదర్శించి, ప్రజలకి వాటి విశిష్టతను విశద పరచుటకై మరి మూడు కేంద్రాలు కూడా ప్రారంభింప బడగలవు. వివిధ మండల కేంద్రాలలో సాంకేతిక సిబ్బందికి, ఆసక్తిగల రైతులకికూడా ఆధునికచెఱకు సాగులో శిక్షణయివ్వబడుతుంది. ఈ సాగు విషయంలో లభించిన పరిశోధన ఫలితాల్ని గురించి అభివృద్ధి కార్యక్రమ సిబ్బంది ప్రచారం చేస్తున్నది. ఇటీవల తీవ్ర యెరువు వాడకం వుద్యమం ఒకటి మంజూరు చేయబడింది. అభివృద్ధి కార్యక్రమం అమలు జరిగే ప్రాంతాలలో సగటున యెకరానికి 32.49 టన్నుల చెఱకు వుత్పత్తి అవుతున్నదిట. దీనివల్ల రైతులకి రూ 28.73 లక్షల అదనపు ఆదాయం వస్తున్నదిట.

పంచదార వుత్పత్తి విషయంలో, 1956—57లో రాష్ట్రంలోని పంచదార ఫ్యాక్టరీలన్నీ పూర్తిగా

పనిచేశాయి. మొత్తం మీద 14,25,135 టన్నుల చెఱకు మరపట్టబడింది. రూ. 1,355 లక్షల విలువ గల 1,35,446 టన్నుల పంచదార వుత్పత్తి అయింది. కొత్తగా 14 సహకార, ప్రైవేటు పంచదార ఫ్యాక్టరీల్ని నెలకొల్పాలనీ, ప్రస్తుతపు ఫ్యాక్టరీల వుత్పత్తి శక్తిని అధికం చేయాలనీ కూడా సంకల్పించబడింది. ఈ ఫ్యాక్టరీలన్నీ పని ప్రారంభించి నప్పుడు పంచదార వుత్పత్తి ప్రస్తుతపు వుత్పత్తికి రెట్టింపు కాగలదని భావించబడుతున్నది.

8. మిర్చి : మిరపకాయలు మన రాష్ట్రంలో పండే మరొక ముఖ్యమైన వాణిజ్య పంట. దీని క్రింద దాదాపు 4.0 లక్షల యెకరాలున్నాయి. భారత దేశంలో యీ పంట క్రిందగల మొత్తం ప్రాంతంలో యిది 27 శాతం. మన రాష్ట్రంలో యేటా 1.03,000 టన్నుల మిర్చి పండుతుందని అంచనా. లాంవ్యవసాయ పరిశోధన కేంద్రంలో మిర్చి పంట అభివృద్ధికి తీసుకోవలసిన చర్యల విషయంలో పరిశోధన జరుగుతున్నది. ఎక్కువపండే జి. 1, జి 2. రకాలు రైతులకి పంపిణీకై విడుదల చేయబడ్డాయి. ఇవి చీడను బాగా నిరోధించగలవు. కోస్తాలో వర్షాధారమైన ప్రాంతాలలో 60 శాతానికి పైనగల భూమిలో యివి పండించ బడుతున్నాయి. మరొక మంచిరకం (జి.ఏ 452-1) కూడా సాధించబడింది. ఇది జి 2. కంటె 10 శాతం యెక్కువ పండుతుంది. ఈ రకం యిప్పుడు పంపిణీ చేయబడు తున్నది. మొక్కలమధ్య వుండవలసిన దూరం, నారుమొక్కలయీడు మున్నగు విషయాలలో వుత్తమ పద్ధతులు కనుగొన బడినవి. అవి రైతులకు సిఫార్సు చేయబడు తున్నాయి. అధిక ఫలాన్నిస్తూ మంచిరంగు, నాణ్యంగల పెద్ద పెద్ద కాయలుకాసే రకాల సాధనకై యింకా కృషి జరుగుతున్నది. తగిన పచ్చి యెరువు పంటను, రసాయన యెరువులు వాడవలసిన తరుణాన్ని నిర్ణయించుటకై ప్రయోగాలు జరుగు తున్నాయి.

తెలంగాణా ప్రాంతం పరిస్థితులలో యెక్కువ పండే రకాల సాధనకై మెదక్ జిల్లా సంగారెడ్డిలో యిటీవల అభివృద్ధి కార్యక్రమం ప్రారంభించ బడింది.

## (బి) ధనియాలు

లాం వ్యవసాయ పరిశోధన కేంద్రంలో యెక్కువ పండే జి. 14 రకం సాధించబడింది. దీనిని ఆ ప్రాంతంలో అంతా వాడుతున్నారు. దీనికంటె మంచిరకాల సాధనకై కృషి జరుగు తున్నది.

## (సి) పసుపు

మన రాష్ట్రంలో ముఖ్యమైన వాణిజ్య పంటలలో పసుపు ఒకటి. ఇండియాలో యీ పంటక్రింద గల భూమివిస్తీర్ణం 1,35,000 యెకరాలు. ఈ విస్తీర్ణంలో నాలుగోవంతు మనరాష్ట్రంలో వున్నది. మనకి సాలీనా 60,000 టన్నుల పసుపు పండుతుందని అంచనా. పసుపు వుత్పత్తిని, నాణ్యాన్ని హెచ్చించుటకవలంబింపవలసిన పద్ధతులు మున్నగు విషయాలలో గుంటూరు జిల్లా పెదపాలెం పసుపు పరిశోధన కేంద్రంలో 1956 నుంచి కృషి జరుగుతున్నది. రాష్ట్రం వివిధ ప్రాంతాలలోను, యితర రాష్ట్రాలలోను పండే రకాలు స్థానిక రకాలతో సరి పోల్చి చూడబడుతున్నాయి. మొక్కల మధ్య వుండవలసిన దూరం, విత్తనం సరుకురకం, తక్కువ ఖర్చుపై యెరువులు వేసి యెక్కువ పంట సాధించే మార్గం మున్నగు విషయాలలో ప్రయోగాలు జరుపబడు తున్నాయి.

వ్యాధి సంభవం, దానినివారణకి సంబంధించిన విషయాలు కూడా పరిశీలించబడుతున్నాయి.

## ఫలోత్పత్తి

మన రాష్ట్రంలో 3,50,464 యెకరాలలో పళ్లతోటలు, 6,59,059 యెకరాలలో కూరగాయల తోటలు వున్నాయి. ఈ ప్రాంతం పరిమాణం రాష్ట్రంలో పంటల క్రిందగల మొత్తం భూమిలో దాదాపు 2 శాతం. ఇంచుమించు 18.4 లక్షల టన్నుల తోటవస్తువులు వుత్పత్తి అవుతాయని అంచనా. వీటి విలువ రూ. 15 కోట్లు నిత్య తలసరి వాడకం 20 ఔన్సులు. రాష్ట్రంలో వాడకానికి తగినన్ని ఫలాలు, కూరగాయలు వుత్పత్తి

కావడంలేదు. అయినప్పటికీ రూ 3 కోట్ల విలువ చేసే యించుమించు 2.5 లక్షల టన్నుల ఫలాలు దేశంలోని యితర ప్రాంతాలకి యెగుమతి చేయ బడుతున్నాయి.

దేశంలో ఫలోత్పత్తి జరిగే ముఖ్య రాష్ట్రాలలో మన రాష్ట్రం ఒకటి. ఇదిలావుండగా మామిడి తోటల విస్తీర్ణం, మామిడిపళ్ల వుత్పత్తి వాడకా లలో భారతదేశం ప్రపంచంలో అగ్రశ్రేణినాక్రమిస్తు న్నది. ప్రపంచంలో వుత్పత్తి అయే అరటి పళ్లలో అయిదవ వంతు భారతదేశంలో వుత్పత్తి అవు తున్నాయి. అలాగే యిక్కడ వుత్పత్తిఅయే నిమ్మ జాతి పళ్లు ప్రపంచ వుత్పత్తిలో యించుమించు 3 శాతం వుంటాయి.

## పరిశోధనావ్యవస్థ

1935 లో కడప జిల్లా కోడూరులో ఫల పరిశోధన కేంద్రం స్థాపనతో తోటల పెంపకం విషయంలో పరిశోధన ప్రారంభమయింది. కోడూరు రాయలసీమలో నిమ్మజాతి పళ్లు, మామిడి పళ్లు వుత్పత్తి అయే ప్రాంతం నడి మధ్యలో వున్నది.

తెలంగాణాలో మామిడి, సీతాఫలాల అభివృద్ధికై 1953లో సంగారెడ్డిలో స్థాపించబడిన ఫల పరిశోధన కేంద్రం పనిచేస్తున్నది. ఈ ప్రధాన కేంద్రాలు రెండూకాక తోట పరిశ్రమపై పరిశోధన జరిపే వుపకేంద్రాలు 9 వున్నాయి. వివరాలు యివి:

| కేంద్రం పేరు | | పరిశోధన జరిగేపంట |
|---|---|---|
| 1. బారువపోకనారు పెంపక కేంద్రం | — | పోక |
| 2. అనకాపల్లి చెఱకు పరిశోధన కేంద్రం | — | ఫలాలు |
| 3. రంప చోడవరం ఫల పరిశోధన కేంద్రం | — | తోట పంటలు |
| 4. చెన్నూరు పుచ్చ పరిశోధన కేంద్రం | — | పుచ్చకాయలు |
| 5. బాపట్ల జీడి మామిడి పరిశోధన కేంద్రం | — | జీడ మామిడి |
| 6. గిద్దలూరు మోడల్ ఆర్చర్డు | — | ఫలాలు |
| 7. వ్యవసాయ పరిశోధన సంస్థ | — | కూరగాయలు |
| 8. రుద్రూరు వ్యవసాయ పరిశోధనసంస్థ | — | అరటి, కొబ్బరి |
| 9. వరంగల్లు వ్యవసాయ పరిశోధన కేంద్రం | — | కూరగాయలు |

వీటికి తోడు పశ్చిమగోదావరి జిల్లా తణుకులో ఒక అరటి పరిశోధన కేంద్రం, కర్నూలులో ఒక కూరగాయల పరిశోధన కేంద్రం, కోడూరులో ఒక వుల్లి పరిశోధన కేంద్రం త్వరలోనే స్థాపించబడ గలవు.

ఈ కేంద్రాలలో పరిశోధన కార్యక్రమం హార్టి కల్చరిస్టు, ఫల నిపుణుల అధ్వర్యాన జరుగుతుంది. దీన్ని జరుపుటకు యించుమించు 30 మంది అసిస్టెంట్లు, ముగ్గురు సహాయ పరిశోధనాధికార్లు వున్నారు. తోటలు వేయుటకు తోట వారిశ్రామికు లకు రూ 4-5 లక్షలు అప్పులు యిచ్చుటకు, వారికి సాంకేతిక సలహాను లభింపచేయుటకు యిటీవల ఒక తోట పెంపక విస్తరణ విభాగం ప్రారంభింపబడింది.

యావత్ దక్షిణ భారతానికి పనికి వచ్చే ప్రాంతీయ పరిశోధన కేంద్రాన్ని కోడూరులో నెల కొల్పాలని సంకల్పించబడింది. దక్షిణ భారతంలో వుత్పత్తి అయే నిమ్మజాతిపళ్లు, మామిడిపళ్లు విష యంలో యిక్కడ తీవ్ర పరిశోధన జరుగుతుంది. వీటి విషయంలో జరిగిన పరిశోధన సమన్వయం చేయబడుతుంది కూడా.

## నూతన పరిణామం

పళ్లు, కూరగాయల పెంపకం యిప్పుడు కాల క్షేపానికో లేక జీవనోపాధినిమిత్తమోకాక లాభ సాటి పరిశ్రమగా చేపట్టబడుతున్నది. సుమారు 200 నారు పెంపక కేంద్రాలలో సాలీనా యించు

మించు 20 లక్షల పళ్లమొక్కలు పెంచబడు తున్నాయి. రాష్ట్రమంతటా వందలాది పళ్ల తోటలు లేస్తున్నవి. ప్రస్తుతం పళ్లు, కూరగాయల క్రింద 13 లక్షల యెకరాలున్నట్టు అంచనా. 8లక్షల టన్నుల పళ్లు, కూరగాయలు యెగుమతికై మిగులుతాయి.

1954 లో కోడూరు ఫల పరిశోధన కేంద్రంలో రెండు యెకరాల నిమ్మతోట మీద రూ 12,000/- లాభంవచ్చింది. ఇంత లాభం యింతకు ముందెప్పుడూ యెక్కడా రాలేదు. దీన్ని బట్టి శాస్త్రీయ పద్ధతిలో పళ్ల తోటలను పెంచితే వుత్పత్తిని బాగా హెచ్చించవచ్చునని విదితమవుతున్నది. హైదరాబాదులో సుప్రసిద్ధమైన "అనాబేసాహే" ద్రాక్షపళ్లు యెకరానికి 80,000 పౌనులు వుత్పత్తి అయినవి. ఈ సందర్భంలో యెకరాదాయం రూ 30,000/- బహుశా భారత దేశంలో మరే పంటపైనా యింత యెక్కువాదాయం వచ్చి వుండదు. నిమ్మ, సాత్కూడీ ఆరంజి, మామిడి, ద్రాక్షపళ్లపై బాగా లాభాలు రావడంతో మన రాష్ట్రంలో ఫల పరిశ్రమ ఒక్కుమ్మడిని అభివృద్ధి చెందుతున్నది. మిర్చి, అల్లం, పసుపు మున్నగు వస్తువులు కూడా చాలా యెక్కువగా పండించ బడుతున్నాయి. వీటి వుత్పత్తి యెంత యెక్కువగా వున్నదంటే యీ విషయంలో చాలా త్వరలోనే మనరాష్ట్రం భారత దేశంలో ఒక నిర్దిష్ట స్థానాన్ని ఆక్రమించగలదు. అరటి పళ్లను సర్వ సాధారణంగా ప్రజలందరూ వాడుతున్నారు. అది నిత్య భోజన పదార్థంగా మారుతున్నది. జీడమామిడి గింజలు ముఖ్యంగా డాలర్లను సంపాదించే పంట. కోస్తా జిల్లాల్లో దీని క్రింద 10,000 యెకరాలున్నాయి.

ప్రస్తుతం మనరాష్ట్రంలో తోటలకి సరైన స్థలం నిర్ణయించి, వాటిని ఒక పద్ధతిలో పెంచటం లేదు. పళ్ల మొక్కల్ని ఏ మొక్క యెటువంటిదో తెలుసుకోకుండా నాటడం జరుగుతున్నది కూడా. అవైన పళ్ల నిలువకి, రవాణాకి సౌకర్యాలు లేవు. ఇవి తోట పరిశ్రమాభివృద్ధికి ఆటంకంగా పరిణమిస్తున్నవి. ఈ విషయాలన్నిటిలోను తోట పారిశ్రామికులకు సరైన సమాచారం లభించాలి.

## జరిగిన కృషి

కోడూరు ఫలపరిశోధన కేంద్రంలో జరిగినకృషి ఫలితంగా సాత్కూడి, నిమ్మ తోటలలో చిన్న మొక్కల్ని నాటుటకంటే మొగ్గ తొడిగిన చెట్లను నాటుట లాభదాయకమని స్పష్టపడింది. తత్ఫలితంగా రాష్ట్రంలో యిప్పుడు నిమ్మనారు పెంపక కేంద్రాలు నూటికి పైగా ప్రారంభింపబడ్డాయి. మిశ్రమజాతి మామిడి విత్తనాలు యిప్పుడు పంపిణీ చేయబడుతున్నాయి జామి, సపోటాలలో మేలు రకాల సాధనకై జాతి మిశ్రమ కార్యక్రమం అమలు జరుపబడుతున్నది. కోడూరులోని ప్రభుత్వ నారుపెంపక కేంద్ర. సాలీనా 25 వేల పళ్ల మొక్కల్ని సరఫరా చేస్తున్నది. ఇవి 400 యెకరాలకి సరిపోతున్నవి. సంగారెడ్డి ఫలపరిశోధన కేంద్రంలో మామిడి రకాలు 260కి పైగా వున్నాయి. మామిడి చెట్లు యేడు విడిచి యేడు కాసే వుత్తర ప్రదేశ్ రకాలు లంగ్డా, దాసేరీలతో సహా ప్రతి యేటా కాస్తాయని పరిశీలనలవల్ల తేలింది. మామిడిలో అనేక ప్రసిద్ధ రకాల మొక్కలు, మిశ్రమ జాతి రకాలు 80కి పైన సంపాదించబడినవి.

## సీతా ఫలాలు

ప్రత్యేకంగా రూపొందించబడిన ఒక పద్ధతి ద్వారా యెక్కువపండే రకాలు పెంచబడు తున్నాయి. ఈ పళ్లలో గింజల నిష్పత్తి 80 శాతానికి తగ్గించ బడింది.

ప్రభుత్వ శాఖ నిర్ణయించిన అనాబే సాహేరకం ద్రాక్ష భారత దేశంలోకే వుత్తమ మైనదిగా భావించ బడుతున్నది. ఈ రకం పళ్లు అధికంగా వుత్పత్తి కావడమే కాక మంచి నాణ్యంగా కూడా వుంటాయి. పెద్ద పెద్ద పళ్ల గుత్తులు చాలా ఆకర్షణీయంగా వుంటాయి. ద్రాక్ష పళ్ల పారిశ్రామికులు చాలా మందికి యెకరానికి యించుమించు రూ5,000/- ఆదాయం వస్తున్నది. మన రాష్ట్రంలో ద్రాక్షతోటలు చాలా త్వరగా అభివృద్ధి చెందు

తున్నాయి. అది త్వరలోనే ద్రాక్షపళ్ల ఉత్పత్తిలో ఇండియాలో ప్రథమశ్రేణి నాక్రమించవచ్చు.

కూరగాయల విషయంలో, టొమేటో, వంగ, బెండలలో కొత్తరకాలు ప్రవేశపెట్టబడ్డాయి. ఈ మేలురకాల క్రిందగల భూమి విస్తీర్ణం శీఘ్రంగా అభివృద్ధి చెందుతున్నది. రూ 7,500/- ఖరీదుచేసే విత్తనాలు పూర్తిగా అమ్మకమయి పోయాయి.

## అభివృద్ధి పథకం

మన రాష్ట్రంలో మొత్తం 6,59,369 యెకరాలలో కూరగాయలు పండించబడుతున్నాయి. మిర్చి, కొత్తిమిరి, వంగ, టొమేటో, ఫ్రెంచిబీన్సు, గుత్తిచిక్కుడు, పొట్ల, కాకర, బీర మున్నగు రకాలు యిక్కడ ముఖ్యంగా పండించ బడతాయి. రాజేంద్రనగర్ వ్యవసాయ పరిశోధన కేంద్రంలో కూరగాయల అభివృద్ధికై అమలు పరచ బడుతున్న యీ పథకం ఖర్చును భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం, రాష్ట్ర ప్రభుత్వాలు చెరిసగం భరిస్తాయి. ఈ పథకంలో చేర్చబడిన కూరలవివరాలు యివి: 1. వంగ, 2. టొమేటో, 3 బెండ, 4. ఫ్రెంచి బీన్సు, 5. గుత్తిచిక్కుడు, 6 బీర, పొట్ల, కాకర మున్నగునవి. గడచిన రెండు సంవత్సరాల నుంచి యీ పథకం క్రింద జరిగే కృషి వివరాలు దిగువ యివ్వబడినవి.

1 వంగ: దేశం వివిధ ప్రాంతాలనుంచి 40 రకాల వంగ విత్తనాల్ని తెచ్చి, పరిశీలన ప్లాట్లలో పెంచడం జరుగుతున్నది. ఆకుపచ్చ, వూదారంగులలో గుత్తులు గుత్తులుగా కాసేపొడుగు వంకాయలు స్థానిక రకాలకంటె 25 శాతం యెక్కువ కాస్తాయని తేలింది. వూదారంగు రకం స్థానిక రకాలకంటె మంచిదని కూడా తేలింది. మొక్కల మధ్య దూరం 3 అ. × 2 అ. కంటె 2 అ. × 2 అ. వుంచేది మంచిది. ఎరువు వాడకం విషయంలో ప్రయోగాలు జరుగు తున్నాయి.

2. టొమేటో: పరిశీలన ప్లాట్లలో 64 రకాలు పెంచబడుతున్నాయి. 'సియోక్సు', అభివృద్ధి పొందిన 'మీరూతీ' రకాలు 'పాండరోజా', 'మార్ గ్లోబ్' రకాల కంటె మంచివని తేలింది. మొక్కల మధ్య దూరం 2అ × 2అ, 3అ × 3అ కాక 2అ × 1 1/2అ వుండాలి.

3. బెండ: 21 రకాలు సేకరించబడ్డాయి. శంకరపల్లి (స్థానికరకం), 'రెడ్ వండర్' 'మోంటెయిన్', లక్నో 5114 రకాలు మరికొన్ని ప్రయోగాలు జరుపుటకై ఎన్నుకబడ్డాయి,

'రెడ్ వండర్', శంకరపల్లి రకాలు రాజాస్థాన్ రకం కంటె మంచివని తేలింది. మొక్కల మధ్య దూరం 2అ × 2అ కాక 2అ × 1అ, 2అ × 1 1/2అ వుండాలి.

4. ఫ్రెంచిబీన్సు: పరిశీలన ప్లాట్లలో 30 రకాలు పెంచబడుతున్నాయి. 'అస్గ్రో స్ట్రింగ్ లెస్' రకం కంటె 'కెనేడియన్ బొలారం', 'బౌంటిఫుల్' రకాలు మంచివి. మొక్కల మధ్య దూరం 2అ × 2అ వుండాలి.

5 గుత్తిచిక్కుడు: పరిశీలన ప్లాట్లలో 13 రకాలు పెంచబడుతున్నాయి. 'నడియద్', 'గుజరాత్', 'వెర్మాన్' మున్నగు రకాల విషయంలో ప్రయోగాలు జరుపబడుతున్నాయి.

పొట్ల,బీర వగైరా: 16 రకాల ఆనపకాయలు, 20 రకాల కాకర కాయలు, 13 రకాల బీరకాయలు, 8 రకాల పొట్లకాయలు కాపించబడుతున్నాయి. వీటిలో యే యే రకాలు బాగా కాస్తాయో పరిశీలించబడుతున్నది.

---

# ఆంధ్ర పోలీసు ఆఫీసరుకు పోలీసు పతకం బహూకరణ

నెల్లూరు జిల్లాలో అఫీషియేటింగు పోలీసు సబ్-ఇనస్పెక్టరు శ్రీ రామిశెట్టి పెదనరసింహం సూళ్లూరుపేట వరద సమయంలో కష్టతరమైన రక్షణ కార్యక్రమాన్ని నిర్వహించినందుకు ఆయనకు రాష్ట్రపతి పోలీసు పతకాన్ని బహుకరించారు.

1957 నవంబరు 3, 5 తేదీల మధ్య కురిసిన కనీ వినీ యెరుగని కుంభవృష్టి కారణంగా నెల్లూరు జిల్లా సూళ్లూరు పేటలోని పల్లపు ప్రాంతాలు పూర్తిగా మునిగి పోయినవిట. అప్పుడు శ్రీ నరసింహం సమయస్ఫూర్తితో తగిన యేర్పాట్లు చేసి ఆ ప్రాంతాల ప్రజలలో సాధ్యమైనంత యెక్కువ మందిని సురక్షిత ప్రాంతాలకిచేర్చారు. ఈ అదును చూసుకుని సంఘ వ్యతిరేక శక్తులు తలెత్త కుండా కూడా ఆయన ముందు జాగ్రత్తలు తీసుకున్నారు.

నవంబరు 5వ తేదీన కొందరు మనుషులు వరదలలో కొట్టుకొనిపోయే ప్రమాదం పర్పడినదని శ్రీ నరసింహానికి వార్త అందింది. వారిని రక్షించేందుకై ఆయన వెంటనే ఒక లారీ తీసుకొని వెళ్లారు. కాని వరదల మూలకంగా ప్రమాద ప్రాంతాన్ని చేరుకోలేకపోయారు.

అప్పుడు ఖాళీ కిరసనాయిలు డబ్బాలు, వెదురు దబ్బలు, కొయ్య పలకలతో ఒక తెప్ప తయారు చేసి ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని గుడిసెలపైకి ఎక్కి వున్న ఎనమండుగురి ప్రాణాల్ని కాపాడారు. రక్షణ చర్యలు జరపడానికై శ్రీ నరసింహం ప్రమాదకరమైన వరద ప్రవాహాలలో ఎంతో దూరం యీదవలసి వచ్చింది కూడా.



శ్రీ ఆర్. పెదనరసింహం

# మెట్రిక్ పద్ధతి తూనికలు, కొలతలు

ప్రస్తుతం మన దేశంలో వివిధ రకాల తూనికలు, కొలతలు అమలులో వున్నాయి. వాటిస్థానంలో మెట్రిక్ పద్ధతి తూనికలు, కొలతల్ని వుపయోగించడం చాలా లాభకరం. కాబట్టి యావద్భారత దేశంలోను వాటిని ప్రవేశ పెట్టాలని కేంద్ర ప్రభుత్వం నిశ్చయించింది. ఇందు నిమిత్తం 1956లో తూనికలు, కొలతల ప్రమాణీకరణ చట్టం చేయబడింది. ఈ కొత్త తూనికలు, కొలతల కార్యక్రమాన్ని దేశంలోని యితర రాష్ట్రాలతో పాటు తాను కూడా 1958 అక్టోబరు 1వ తేదీ నుంచి ప్రారంభించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిశ్చయించింది. ఈ కొత్త పద్ధతి అమలు నిమిత్తం యీ ప్రభుత్వం యింతవరకూ తీసుకున్న చర్యల వివరాలు యివి.

మార్పుకు సంబంధించిన వివరాల విషయంలో పనిచేసి, ప్రభుత్వానికి అవసరమైన సిఫార్సులు చేయడానికై "మెట్రిక్ తూనికలు, కొలతలపై ఇంటర్-డిపార్టుమెంటల్ స్టాండింగు కమిటీ" అనే కమిటీ ఒకటి యేర్పాటు చేయబడింది. ఈ కమిటీ సిఫార్సుల ననుసరించి మెట్రిక్ పద్ధతి తూనికలు, కొలతల్ని రాష్ట్రంలోని రెగ్యులేటెడ్ మార్కెట్లలో ప్రవేశపెట్టాలని ప్రభుత్వం నిశ్చయించింది. ఈ పద్ధతి మొట్టమొదట దిగువ పేర్కొన్న 7 జిల్లాల్లోను ప్రవేశ పెట్టబడుతుంది

ఆంధ్ర ప్రాంతం

1. విశాఖ పట్నం, 2. కృష్ణా, 3, గుంటూరు, 4. కర్నూలు.

తెలంగాణా ప్రాంతం

1. హైదరాబాదు, 2. వరంగల్లు, 3. నిజామాబాదు

రాష్ట్రంలోని యితర జిల్లాలో యీ పద్ధతి తరువాత క్రమేణా ప్రవేశ పెట్టబడుతుంది.

ఇంతవరకూ రూపాయణాపైసలలో వివరింపబడే కిమ్మతు ధరలు, రేట్లు మున్నగు వాటిని రూపాయలలో-రెండు దశాంశ స్థానాలు కల అంకెలలో వివరించమని ఆయాశాఖలకి ఆదేశించబడింది. దశాంశస్థానానికి కుడివైపునగల అంకెలు నయాపైసలను సూచిస్తాయి వస్తువుల పరిమాణం మున్నగు వాటిని (అనగా పంట క్రిందగల ప్రదేశాలు, పంట వుత్పత్తి పారిశ్రామిక వుత్పత్తి వగైరా) ప్రస్తుతపు యూనిట్లలోనే వివరంచమని అయితే మొత్తం అంకెలను వాటికి సమానమైన మెట్రిక్ పద్ధతి యూనిట్లలోకూడా వివరించమని కూడా ఆదేశించబడింది. కేంద్ర వస్తుక్రయ శాఖలోని సరుకు నిమిత్తం పంపే ఇండెంట్లన్నిటిలోను సరుకు పరిమాణం, ధరల విషయంలో ప్రస్తుతం అమలులో వున్న యూనిట్లను, వాటికి సమానమైన మెట్రిక్ పద్ధతి యూనిట్లను కూడా పేర్కొవాలని సరుకును తెప్పించే ప్రభుత్వ శాఖలన్నిటికి ఆదేశించబడింది. కేంద్రవస్తుక్రియ శాఖ డైరెక్టరు కూడా మార్కెటు నుంచి ఆహ్వానించే టెండర్లలో వస్తు పరిమాణాలు, ధరల్ని యీ విధంగానే వివరించాలి. కాకినాడ పారిశ్రామిక శిక్షణా సంస్థ, నిజామాబాదు ప్రభుత్వ సాంకేతిక శిక్షణా కేంద్రాలలో కూడా యీ పద్ధతి ప్రవేశ పెట్టబడుతుంది. డ్రాఫ్టుమెన్ కోర్సు మొదటి సంవత్సర పాఠ్య ప్రణాళికలో మెట్రిక్ పద్ధతిని ప్రవేశ పెట్టమని, ఆ కోర్సు రెండవ సంవత్సర తరగతులలో యీ మార్పును గురించి చెప్పడానికి కొంత కాలాన్ని కేటాయించమని పై సంస్థల ప్రిన్సిపాల్సుకి చెప్పబడింది. రోడ్లమీద ప్రస్తుతం వున్న మైలు, ఫర్లాంగు రాళ్ల కెదురుగా కిలో మీటరు, అరకిలో మీటరు రాళ్లను యేర్పాటు చేయడం ఆరంభించమని రహదార్ల చీఫ్ ఇంజనీరు, స్థానిక పరిపాలన, ప్రజారోగ్య చీఫ్ ఇజంనీరు, అడవుల చీఫ్ కన్సర్వేటర్లు ఆదేశించబడ్డారు

ఇందుకు సంబంధించిన వారందరూ సహకరిస్తేనే యీ మార్పు విజయవంతమవుతుంది. అన్ని వర్గాల ప్రజలు మనస్ఫూర్తిగా యిందుకు సహకరిస్తారని ఆశించబడుతున్నది.

# ప్రజల పెట్టుబడి

బదురికా వాణిజ్య కళాశాల విద్యార్థి సమితి తరఫున ఆ సమితి వుపాధ్యక్షుడు శ్రీ నందగోపాల్, సంయుక్త కార్య దర్శి శ్రీ కృష్ణదీహికర్ లు ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రికి, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విజయార్థం వుపయోగించుటకై రూ 1000 చెక్కును సమర్పించారు.

ఈ విద్యార్థుల్ని వారి దేశభక్తికై ముఖ్యమంత్రి అభినందించారు.



ముఖ్యమంత్రి చెక్కును తీసుకుంటున్నారు




HALI SICCA ACCOUNT

D/ 666384 State Bank of Hyderabad 28/3/1958

Hyderabad State Bank

हैदराबाद स्टेट बैंक Sultan Bazar, Hyderabad-Dn.

Pay to The chief Minister's, Govt of Andhra Pradesh or Bearer

Rupees One thousand only

Badruka College Students UNION

Rs. 1000-00

Students' Counsellor

Principal

A/c payee

Fol. Entd.

బద్రుకా కళాశాలా విద్యార్థి సమితి సమర్పించిన చెక్కు నమూనా

నిజామాబాదు జిల్లా బోధన్‌లోని కార్మికుల తరపున శ్రీ ఎస్. బి. గిరి రాష్ట్ర ముఖ్య మంత్రి 14-4-58 న ఒక చెక్కును సమర్పించారు.



చెక్కు సమర్పణను చిత్రంలో చూడవచ్చు

# మన జీడిమామిడి తోటల అభివృద్ధి

దేశంలో జీడిమామిడి గింజల వుత్పత్తిని హెచ్చించే తలంపుతో కేంద్ర ప్రభుత్వం (భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం) రాష్ట్రంలో జీడిమామిడి తోటల అభివృద్ధి పథకాల అమలుకి ధన సహాయం చేయగలనని సూచించింది. తన్మూలంగా "ఆంధ్రప్రదేశ్ అరణ్యేతర ప్రాంతాలలో జీడిమామిడి తోటల అభివృద్ధి పథకా"న్ని ప్రభుత్వం ఆమోదించింది. దీని అంచనాఖర్చు రూ 31,13,723. (ఇందులో రూ 30.0 లక్షలు జీడిమామిడి తోట పారిశ్రామికులకు అప్పులుగా యివ్వబడుతాయి. రూ 1,13,723 సిబ్బంది, అత్యవసర ఖర్చులకి వినియోగింప బడతాయి). ఈ పథకం నాలుగు సంవత్సరాల పాటు అమలు జరుగుతుంది. ఇది కేంద్ర ప్రభుత్వం ఆమోదానికై పంపబడింది. వారు (భారతీయ వ్యవసాయ పరిశోధన సంఘం వారు) దానికి ఇండియా అధ్యక్షుని ఆమోదం లభించినట్టు తెలియచేస్తూ, తమవంతుఖర్చుగా రూ 20,950 గ్రాంటును మంజూరు చేశారు. 9 00 లక్షల అప్పును కూడా మంజూరు చేశారు. ఈ అప్పు అది యివ్వబడిన 5 సంవత్సరాల తర్వాత వడ్డీతో సహా 5 సంవత్సర వాయిదాలలో తిరిగి చెల్లించబడాలి. రాష్ట్ర ప్రభుత్వం యీ గ్రాంటును, అప్పును అంగీకరించి యీ పథకం 1-4-58 నుంచి రెండు సంవత్సరాల పాటు రూ 9,45,340 మించని అంచనా ఖర్చుపై అమలు జరుగుటకు అంగీకరించింది.

ఈ సందర్భంలో మంజూరైన సిబ్బంది 'జీడిమామిడి తోటల అభివృద్ధి అధికారి' క్రింద పని చేస్తుంది. ఈ అధికారి జీతం స్కేలు యిది : రూ 230-30/2-260-40/2-500-60/2-700.

# ప్రజా శ్రేయస్సు ప్రణాళిక లక్ష్యం

## ఆంధ్ర దేశమంతటా ప్రచార వారోత్సవాలు

1958 ఏప్రిల్ 8, 14 తేదీలమధ్య ఆంధ్రప్రదేశ్ జిల్లాలన్నిటిలోను ప్రణాళికాప్రచార వారం జరుప బడింది. రాష్ట్ర ప్రభుత్వం అమలు జరిపే అభివృద్ధి కార్యక్రమాలకి తగిన ప్రచారమిచ్చి, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక విషయంలో ప్రజల్ని వుత్సాహ పూరితుల్ని చేయుటకై యిదివుద్దేశించ బడింది. జిల్లా ముఖ్యపట్నాలన్నిటిలోను వుచిత రీతిని జరుపబడిన యీ వారోత్సావాలలో అధికారులు, అనధికారులు కూడా పాల్గొని, ప్రణాళికా పధకాల క్రింద ఆయాప్రాంతాలలో అంగలలో సాధించబడే అభివృద్ధిని గురించి ప్రజలకు వివరించి చెప్పారు. మచ్చుకి రెండు జిల్లాల్లో జరిగిన కార్యక్రమం వివరాలు దిగువ యివ్వబడినవి.



శ్రమదాన కార్యక్రమం: ఇందులో ఆఫీసర్లు కూడా పాల్గొన్నారు.

### శ్రీకాకుళం

స్థానిక పరిపాలన శాఖ మంత్రి శ్రీ డి. సంజీవయ్య టెక్కలిలో యీ వారోత్సవాల్ని ప్రారంభించారు. ఇచ్ఛాపురం అనంతర తీవ్ర అభివృద్ధి కేంద్రంలో జరిగిన ప్రారంభోత్సవ కార్యక్రమంలో కూడా ఆయన పాల్గొన్నారు. గారసమాజాభివృద్ధి కేంద్రంలోని పాత్రునివలస గ్రామస్థులు 1/2 మైలు కంకర రోడ్డును నిర్మించారు. ఈ వారం విశేషాలలో యిదొకటి. తొలిరోజున జిల్లా కలెక్టరు నాయకత్వాన ఆరంభమైన యీ పని అనుకున్న ప్రకారం ఏప్రిల్ 14 వ తేదీకి పూర్తయింది. ఈ వారం యితర విశేషాలు యివి: పత్రికా ప్రతినధులు, రైతులు రాగోలు పరిశోధన క్షేత్రాన్ని, మన్నయ్యపేట నమూనా క్షేత్రాన్ని, తిమ్మాపురం ఆదర్శ గ్రామాన్ని, ఆముదాలవలస అభివృద్ధి కేంద్రంలోని నీటి పారుదల పనుల్ని సందర్శించారు.

జిల్లా ముఖ్యపట్నంలో యీ వారోత్సవాల్ని శాసన సభ్యుడు శ్రీ ఆర్. ఎల్. ఎన్. దొర ప్రారంభించారు. ఈ సందర్భంలో శ్రమదానం, పారిశుద్ధోద్యమం జరుప బడినవి. ఊరేగింపులు, బహిరంగ సభలు, చిత్ర ప్రదర్శనలు జరుపబడినవి. ఆటల పోటీలు, ప్రణాళికా విషయాలపై వ్యాస రచన పోటీలు కూడా జరుపబడినవి. ఈ వారం తొలిరోజున శ్రీకాకుళంపట్నం ప్రధాన వీధులలో విద్యార్థులు, వయోజనులతో కూడిన వూరేగింపు జరిగింది. దానికి జిల్లా విద్యాధికారి, జిల్లా ప్లానింగు అధికారి నాయకత్వం వహించారు. ఆ సాయం కాలం జరిగిన బహిరంగ సభలో, ఆ వారోత్సవాల ప్రాముఖ్యాన్ని, ప్రణాళిక పుట్టు పూర్వోత్తరాలు

మున్నగు వాటిని గురించి జిల్లా కలక్టరు వివరణాత్మకంగా ప్రసంగిస్తూ ప్రణాళికా విజయానికి ప్రజల సహకారం అత్యావసరమని నొక్కి చెప్పారు.

ఈ వారోత్సవాల్ని ప్రారంభించిన శ్రీ ఆర్. ఎల్. ఎన్. దొర ప్రణాళికా పథకాల అమలుకి ప్రజలలో కార్యోత్సాహాన్ని కలిగించుటలో ప్రచారం కీలక పాత్రవహిస్తుందని నొక్కి చెప్పారు. జిల్లా ప్లానింగు అధికారి, శాసన సభ్యుడు శ్రీ పి. ఎస్. నారాయణ ప్రభృతులు కూడా సభలో ప్రసంగించారు.

9-4-58 న శ్రీ కాకుళంలో శాసన సభ్యుడు శ్రీ పి. ఎస్. నారాయణ అధ్యక్షతన బహిరంగసభ జరిగింది. ఆమరునాడు సమాజాభివృద్ధి కేంద్రం ముఖ్య కార్యాలయ మున్నగారలో బహిరంగసభ, ఫిల్ము ప్రదర్శన జరిగాయి. మిగిలిన రోజులలో యిదివరకే చెప్పినట్లు శ్రమదానోద్యమం మున్నగు కార్యక్రమాలు జరిగాయి.

## నిజామాబాదు

నిజామాబాదు జిల్లా ముఖ్య పట్నం, తాలూకా ముఖ్య పట్నం, అభివృద్ధి కేంద్రం ముఖ్య కార్యాలయమున్న ప్రదేశాలలో యీ వారోత్సవాలు జరుపబడినవి. బన్సవాడలో ఒక బోధనాత్మకమైన ప్రదర్శన యేర్పాటయింది. అందులో వివిధ ప్రభుత్వ శాఖలు పాల్గొన్నవి. ఏప్రిల్ 12వ తేదీ సాయంకాలం జరిగిన బహిరంగసభకి కమ్యూనిటీ డెవలప్‌మెంటు శాఖ మంత్రి శ్రీ ఎమ్. నర్సింగరావు అధ్యక్షత వహించారు. ఆయన ఆ సందర్భంలో ప్రసంగిస్తూ ప్రభుత్వ అభివృద్ధి కార్యక్రమాలలో ప్రజలు పాల్గొని చురుగ్గా పని చేయాలని విజ్ఞప్తి చేశారు. బోధన్‌లోను, ఏద్‌పల్లి అనంతర తీవ్ర అభివృద్ధి కేంద్రంలోను యీ వారం పుచిత రీతిని జరుపబడింది. ఏప్రిలు 11న చింతకుంటలో బ్లాకు అభివృద్ధి కమిటీ వుద్యోగులు, అనధికార సభ్యులు యీ వుత్సవాలలో పాల్గొన్నారు. ఆ మరునాడు ఏద్‌పల్లిలో జరిగిన బహిరంగసభలో ప్రణాళిక ఆశయాలు ప్రజలకు వివరించబడినవి. జాంలంలో శక్తివంతమైన పారిశుద్ధోద్యమం జరుపబడింది. బహిరంగసభ, సాంస్కృతిక కార్యక్రమంకూడా జరుపబడినవి. ఏప్రిల్ 14న దూపల్లిలో ఒక సాంస్కృతిక కార్యక్రమం, బుర్రకథ యేర్పాటు చేయబడినవి.

## గ్రామీణ ప్రదర్శన

ఈ వారోత్సవాల సందర్భంలో తాండూరు జాతీయ వికాససేవా కేంద్రంలో తాండూరు తహసీల్‌దారు ఒక గ్రామీణ ప్రదర్శనను ప్రారంభించారు. ప్రారంభోత్సవం ముగిసిన పిమ్మట అభివృద్ధి కేంద్రం ప్రముఖులు స్టాల్సును సందర్శించారు. అక్కడ వ్యవసాయశాఖ ట్రాక్టరుతో భూమి దున్నడం, గ్రేడరు ప్రదర్శనల్ని యేర్పాటు చేసింది ఆమరునాడు ఆ ప్రదర్శన స్థలంలోనే పశుప్రదర్శన జరిగింది. ఉత్తమ పశువుల యజమానులకి బహుమతులు యివ్వబడ్డాయి. తాండూరు బహిరంగ సభలో ప్రదర్శనలోని వుత్తమ స్టాల్సుకి కూడా బహుమతులు యివ్వబడ్డాయి.



# పురోగమన పథంలో

మీకు తెలుసునా ........

1. నీటి పారుదల చీఫ్ ఇంజనీరు, విద్యుచ్ఛక్తి చీఫ్ ఇంజనీరు, గిరిజన సంక్షేమ శాఖ డైరెక్టరుల అధ్వర్యాన నిర్వహించ బడే అభివృద్ధి పథకాల ఖర్చు 1957-58 లో వాటికి కేటాయించిన మొత్తాల నధిగమించినదని.

2. 1957-58 ఖర్చుకి కేటాయించబడిన మొత్తం కేంద్ర గ్రాంటు రూ 49.72 లక్షలలోను రూ 48.92 లక్షలు 1958 మార్చి నెలాఖరు నాటికి ఖర్చయి పోయినవని

3. 1958-59 లో ఆంధ్రప్రదేశ్‌లో అభివృద్ధి పథకాల అమలుకై ప్లానింగు కమిషన్ రూ 29.95 లక్షల కేంద్ర గ్రాంటును కేటాయించిందని.

4. భారీ సాగు నీటిప్రాజెక్టుల క్రింద తుంగభద్ర దిగువకాలువ పథకం పూర్తి చేయబడిందని.

5. ఈ పథకంవల్ల 36,097–11 యెకరాల మాగాణీ, 1,12,627–89. యె. మెట్ట-మాగాణీ మొత్తం 1,48,725 యెకరాలకి లాభం కలుగుతుందని.

6. 1957-58 లో 40,000 యెకరాల్ని నీటి పారుదల క్రిందకి తేవాలని లక్షించ బడిందని.

7. 1,17,024–23 యెకరాల భూమి బాగై, నీటి నందుకొనుటకు తగి వున్నదని.



# విజయవాడ విద్యాసంస్థలకు వసతి సౌకర్యం

ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో విజయవాడ మునిసిపాలిటీ వారు లబ్బీపేటలో "వేమూరి .శివసుబ్బారావు మెమోరియల్ స్కూలు" అనే పాఠశాలను అంధులనిమిత్తం నిర్మించుటకు ఒకపథకాన్ని అమలు పరిచారు. ఈ పథకం అంచనా ఖర్చు రూ 24,500 కాగా రూ74,489 లు ఖర్చు అయింది.

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో ప్రభుత్వ మిచ్చు ఋణసహాయంతో యీ క్రింది పథకములు అమలు పరుచుటకు తలపెట్టబడింది.

| | | అంచనా ఖర్చు |
|---|---|---|
| 1. | ఇస్లాంపేట, హయ్యర్ ఎలిమెంటరీ స్కూలులో అదనపు వసతి సౌకర్యాలకై భవననిర్మాణం ... | రు 50,000 |
| 2 | హనుమానులు పేటలో ఎలిమెంటరీ స్కూలు కొరకు ఒక క్రొత్త భవనం నిర్మాణం ... | రు 45,000 |
| 3. | సత్యనారాయణ పురంలో ఎ. కె. టి. పి. యం. హెచ్. స్కూలులో అదనపు వసతి సౌకర్యాల యేర్పాటు ... | రు 2,500 |
| 4. | గవర్నరు పేటలో సి. వి. ఆర్. జి. యం. హెచ్. స్కూలులో అదనపు వసతి సౌకర్యాల యేర్పాటు ... | రు 25,000 |



# తెలంగాణా ప్రాంతపు సిబ్బంది కష్టనిష్ఠూరాలు

## సులభంగా దర్యాప్తు సంఘం నివేదనకి సదుపాయం

పూర్వ హైదరాబాదు రాష్ట్రం నుంచి, ఆ రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ కారణంగా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తీసుకున్న సిబ్బంది ఫిర్యాదుల పరిశీలనకై ఒక యిబ్బందుల దర్యాప్తు సంఘం యేర్పాటు చేయబడినట్టు ప్రభుత్వం 18-3-58న ప్రకటించింది. ఈ సంఘానికి చాల తక్కువ ఫిర్యాదులు వచ్చాయి. ఈ విషయంలో వుద్యోగుల సంఘాలు యేమీ విజ్ఞప్తి చేయలేదు కాని యిబ్బందుల నివేదనకి నిర్ణయమైన విధానం తెలంగాణా వుద్యోగులు న్యాయమైన తమ యిబ్బందుల్ని దర్యాప్తు సంఘానికి నివేదించుటకు ఆటంకంగా పరిణమించినదేమోనని వార్తా పత్రికలలో సూచించబడింది. కాబట్టి ప్రభుత్వం నిర్ణయమైన ఆ విధానాన్ని సులభతరం చేయాలని నిశ్చయించింది.

ఉద్యోగులు యిక్కడ నుంచి తమ యేయిబ్బంది నైనా సరాసరి దర్యాప్తు సంఘానికి 'ప్రభుత్వ సాధారణ పరిపాలన శాఖ (రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ బ్రాంచి) డిప్యూటీ సెక్రటరీ, హైద్రాబాదు' అన్న చిరునామాకి పంపవచ్చును. పై అధికారి తెలంగాణా ప్రాంతీయులు. టైపు కాకుండా చేతితో వ్రాసిపంపబడే పెటిషన్ల విషయంలో నాలుగు ప్రతులు పంపాలనే నిర్బంధం లేదు. అయితే ఒక ప్రతి తమ తమ పై అధికార్ల ద్వారా పంపబడినదో లేదో మాత్రం అట్టి దరఖాస్తులలో స్పష్టంగా పేర్కొనబడాలి. చేసిన ఫిర్యాదులు నిజమని ఋజువు కాకపోయినప్పటికీ ఫిర్యాదు చేసిన వుద్యోగుల ప్రయోజనాలకి భంగంకలుగకుండా చూడబడుతుంది. ఉద్యోగులు తమపై అధికార్లపై ఫిర్యాదు చేసిన సందర్భాలలో వారి భవిష్యత్ప్రయోజనాల రక్షణకై అవసరమైన చర్య తీసుకొనబడుతుంది కూడా. విజ్ఞప్తులు పంపే గడువు కూడా యిప్పుడు 1-6-58 వరకూ పొడిగించబడింది. ఆలస్యానికి తగిన కారణం చెప్పిన సందర్భాలలో ఆ తేది తరువాత కూడా దర్యాప్తు సంఘం ఫిర్యాదుల్ని తీసుకోదలిస్తే తీసుకోవచ్చు.

ఈ సంఘం యేయే విషయాలను పరిశీలిస్తుందో 'ఆంధ్రప్రదేశ్' 1958 ఏప్రిల్ నెల సంచికలో వివరించబడింది. అయితే కేంద్ర ప్రభుత్వం యేర్పాటు చేసిన అప్పీల్ కమిటీల పరిశీలన పరిధిలోని విషయాలను కాని హైదరాబాదు రాష్ట్ర పునర్వ్యవస్థీకరణకి పూర్వం ఆ రాష్ట్ర ప్రభుత్వం లేక దాని అధికారులు తుది వుత్తర్వులు చేసిన విషయాల్ని కాని యీ సంఘం పరిశీలించబోదని మరొక మారు చెప్పబడుతున్నది. ఆ రకం ఫిర్యాదులు మామూలు పద్ధతిలో చేయబడాలి కాని యిబ్బందుల దర్యాప్తు సంఘానికి నివేదించబడకూడదు.

"నీ పరీక్ష మార్కులు ఎన్నదగినంత ఎక్కువగా లేవు, కాంతా, కాని నీ బడి దుస్తులు, **టినోపాల్** వల్ల ఎల్లప్పుడూ మెరిసే తెల్లగా వుంటున్నవి గనుక, నీవు ప్యాస్ చేయ బడ్డావు."



"టినోపాల్" జె.ఆర్. గెయిగి, ఎస్.ఎ., బాల్, స్విట్జర్లాండ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు

నిర్మించిన వారు : సుహృద్ గెయిగి ప్రైవేట్ లిమిటెడ్, వాడి వాడి, బరోడా.

సోల్ డిస్ట్రిబ్యూటర్లు : సుహృద్ గెయిగి ట్రేడింగ్ ప్రైవేట్ లిమిటెడ్, పి.ఓ. బాక్స్ నం 965 బొంబాయి.

కొద్దిగా టినోపాల్ తెల్ల బట్టలను అన్నిటికన్నా అతితెల్లగా జేయును.

# "ఆంధ్రప్రదేశ్" ప్రకటన రేట్లు

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్ల ప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరు పేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శాతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}$" డెమ్మీ.
2. ముందటి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతి నెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటి నెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేయబడని డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని పంపవలెను. డిమాండు డ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు—దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యత వహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏ వైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,
సమాచార, పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాదు దక్కన్ — 1.

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకమునకు పెట్టుబడి పెట్టండి!

భారత దేశం యొక్క

సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు,
రైలు మార్గములు, రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

***మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!***

| | |
|---|---|
| *12* సంవత్సరముల ట్రెజరీ ప్లాన్ సేవింగ్సు సర్టిఫికెట్లు | మెచ్యూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5,000 లవి దాకా లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| *10* సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు **డిపాజిట్ సర్టిఫికెట్లు** | ఏడాదికి నూటికి 4 వంతులు చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఒక్కొక్కటి రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి కూడాలభిస్తాయి. |
| **పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకుఅకౌంట్లు** | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి 2½ వంతులచొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. శేషముపై రూ .15,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. |

### 15 సంవత్సరముల ఆన్యూటీ సర్టిఫికెట్లు

| | |
|---|---|
| జారీచేయబడు ధరలు : రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000 రూ 28,000 వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ 28,000 ల వరకు కొనవచ్చును. | నూటికి ఏడాదికి 4½ వంతుల చక్రవడ్డీతో నెలసరి వాయిదాలుగా 15 ఏండ్లలోపల సరిగ చెల్లించబడును |

## ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!
## భారతదేశ ఉజ్జ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!

ఇతర వివరములకు, ఈ పెట్టుబళ్ళకు సంబంధించిన [illegible]

నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా పేరునామాకుగాని లేక
రీజనల్ ఆఫీసరు, హైద్రాబాదు (దక్కన్)
చిరునామాకు, గాని వ్రాయవలెను.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 106,041 చదరపు మైళ్లు |
| జనసంఖ్య | ... | 3,12,60,133 |
| పురుషులు | ... | 1,57,42,912 |
| స్త్రీలు | ... | 1,55,17,221 |
| **సగటు వర్షపాతం** | | |
| ఆంధ్ర ప్రాంతం | ... | 34.6 అంగుళాలు |
| తెలంగాణా | ... | 36.7 ,, |
| **1954–55 లో** | | |
| ఆంధ్ర | ... | 41.5 ,, |
| తెలంగాణా | ... | 34.9 ,, |
| అరణ్య ప్రదేశం | ... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | 1,000 |
| పట్టణాలు | ... | 293 |
| గ్రామాలు | ... | 26,450 |
| పంటల క్రింది ప్రదేశం | ... | 2,93,81,000 ఎకరాలు |
| **1955-56 లో** | | |
| సాగునీరు లభించిన ప్రదేశం | .... | 66.8 లక్షల యెకరాలు |
| కౌళ్ల సంఖ్య | ... | 42,42,655 |
| **1955-56 లో** | | |
| వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | ... | 50.39 లక్షల టన్నులు |
| పశువులు | .... | 2,95,13,000 |
| కోళ్లు | ... | 1,47,37,000 |
| పాల వుత్పత్తి | ... | 15:5 లక్షల గేలన్లు |
| రైలుమార్గాలు | ... | 2,902 మైళ్లు |
| జాతీయ రహదార్లు | ... | 1,409 ,, |
| రాష్ట్ర రహదార్లు | ... | 2,072 ,, |
| జిల్లా పెద్దరోడ్లు | ... | 8,527 ,, |
| జిల్లా ఇతరరోడ్లు | ... | 3,458 ,, |
| పాఠశాలలు | ... | 28,000 |
| కళాశాలలు | ... | 47 |
| వృత్తి విద్యా కళాశాలలు | ... | 31 |

రిజిష్టరు నెం. H-37



రాష్ట్రముఖ్యమంత్రి కర్నూలుజిల్లా పర్యటన : 22-4-58 న దోర్నాల సమీపంలోని
చట్టుపెంట గ్రామంలో లంబాడీలతో కలిసివున్న ముఖ్యమంత్రి.